


“వేసవిలో”

చిత్రం : లంక రామకృష్ణ, రాజమండ్రి.

లోకమంతా పండు వెన్నెలలో మునిగి తేలుతున్నది. ఆ వెన్నెట్లో మిసమిస లాడుతున్నది గౌతమీనది. అందులో తన ప్రతిబింబాలు చూసుకుని మురిసిపోతున్నవి తారకలు, మనసిగ్గుతో ఇదంతా మబ్బు మాటున అప్పుడప్పుడు దాగుకుని గమనిస్తున్న చంద్రుడు నవ్వుకుంటున్నాడు.

బ్రిడ్జ్ మీద, నిండుగర్భిణిలా నెమ్మదిగా బరువుగా సాగిపోతూంది రైలుబండి.

నేను ఎక్కిన పెట్టెలో అందరూ కొంకరి కొంకరగా ఆనుకుని కూర్చుని, కునికిపాట్లు పడుతున్నారు ప్రయాణీకులు. తల్లులు పసిపిల్లల్ని ఒడిలో వేసి జోకొట్టి నిద్ర పుచ్చుతున్నారు.

అంతవరకు సమయం కోసం వేచివున్న నేను కూర్చున్న చోటునుంచి లేచాను. తలుపు దగ్గరికెళ్ళి, నిటుక్కున పాంట్ జేబులోంచి రివాల్వర్ తీశాను.

కొంతమంది నను చూసీ చూడగానే భయంతో బెదిరిపోయి కళ్ళు మూసుకుని నిద్రపోతు

# శిక్ష

'భరణి'



# [illegible]

ఉద్యోగంకోసం చెన్నపట్నం రోడ్లను అరగదీస్తు తిరుగుతున్న రాజాకు, ఒక రోజున ఆపద్బాంధవుడులా మిత్రుడు చంద్రం తటస్థపడి ప్రశ్నలవర్షం కురిపించాడు.

"వారం రోజులయిందిరా" వచ్చి, "సత్రం భోజనం మఠం నిద్రాను. ప్రస్తుతం ఉద్యోగ ప్రయత్నంలో వున్నాను"... "అయితే ఇంతకీ ఇక్కడ నువ్వేం చేస్తున్నటూ" అన్నాడు రాజా.

"ఔనా, నేనిక్కడ సెంట్రల్ ఎక్సైజ్‌లో పనిచేస్తున్నారా. సంవత్సరమున్నరయింది ఇందులో చేరి"...ముందర "రూం కెళ్దాంపద అన్నాడు" చంద్రం.

"ఏం ఫామిలీ పెట్టలేదా" అన్నాడు రాజా.

"లేదురా ఇల్లు దొరకలేదు. ఇల్లు దొరికితే పెడదామనుకుంటున్నా".

ఇలా మాట్లాడుకుంటూనే రూం చేరుకున్నారు. ఆ రాత్రి భోంచేసి సెకండ్ షోకు వెళ్ళి 2 గంటలకు రూం చేరుకున్నారు.

మర్నాడు ఉదయం ఇద్దరూ కలిసి భోంచేశారు. చంద్రం ఆఫీసుకు వెళ్లాడు. రాజా రూముకువచ్చి, తల్లికీ తండ్రికీ క్షేమం తెలుపుతూ ఉత్తరాలురాసి పోస్టు చేశాడు.

సాయంత్రం చంద్రం ఆఫీసునుంచి రాగానే ఇద్దరూ కలసి కాఫీ త్రాగి బీచికి బయలుదేరారు.

"రాజా నీవు ఎన్నాళ్ళున్నా బాధ లేదు" నువ్వేం విచారించవద్దు! ఒక ఆప్త మిత్రునికి సహాయం చేయగలుగుతున్నానని సంతోషంగా వుంది. మా హోటల్లో చెప్పాను. నీ యిష్టమొచ్చినప్పుడెళ్ళి కాఫీ త్రాగు, భోంచెయ్యి. నువ్వు నీ స్వంతం కానీకూడ ఖర్చుపెట్టనవసరంలేదు." అన్నాడు చంద్రం.

* * *

"పోస్ట్" అన్న కేకతో ఉలిక్కిపడి లేచి పోస్టుమేన్ ఇచ్చిన కవరు విప్పుతున్నాడు చంద్రం.

'జి. వి. రాజా' అని గుండ్రంగా చెక్కి వున్నాయి అక్షరాలు. క్రింద "సుశీల" అని ఉంది.

రాజా ఎక్కడికో వెళ్ళాడు ప్రొద్దుటే. దాన్ని చూసేసరికి చిన్నబుద్ధయింది చంద్రానికి. సాహసించి తెరిచాడు. ఉత్తరం క్రింద నుండి పైకిపదిసార్లు అక్షరంపొల్లుపోకుండా చదువుకున్నాడు. చదివి దాన్ని జేబులో దాచుకున్నాడు.

## సి. వి. రావు

అది రాజాదని ఆలోచన రాగానే భయం వేసింది. "ఇది రాజాకి తెలిస్తే ఇంకేమైనా ఉందా...పనిమల్లె గదికి తీసుకువచ్చి చేసేది ఇదా అని ఎంత బాధపడతాడు. బాగా ఆలోచించుకుని క్షమించమని ప్రాధేయపడదామనుకున్నాడు చంద్రం కాని అలా చేయలేక, భయపడి ఊరుకున్నాడు ఏమైతే అయిందని."

* * *

"ఇంకా సుశీలదగ్గర్నుంచి ఉత్తరంరాలేదెందుచేతో అని ఆలోచిస్తున్న రాజా 'పోస్ట్' అన్న కేకతో ఉలిక్కిపడి ఉత్సాహంగా లేచాడు. ఉత్తరం తీసుకోవటంతోనే అతనిముఖాన్ని విచారం అలుముకుంది.

'ఆ అక్షరాలు చూచేసరికి దాన్ని చింపాలనుకున్నాడు రాజా.'

'తరువాత దాని పర్యవసానం ఆలోచించే స్థితిలో లేడు.'

అది చంద్రం భార్య 'శీల' దగ్గర్నుంచి వచ్చింది.

ఒకటికి పదిసార్లు చదువుకున్నాడు. అహో ఎంత బాగుంది. అలాంటి ఉత్తరం తను జన్మలో చూడగలడా ... అందుకని దాన్ని తను దాచుకోవాలనుకున్నాడు.

"కాని ఇది చంద్రానికి తెలిస్తే ఇంకేమయినా ఉందా...

"ఇన్నాళ్ళనుంచి తన్ను పోషిస్తూ ఎంతో అభిమానంతో తన్ను కానీ కూడ ఖర్చు పెట్టనివ్వకుండా చూస్తున్న చంద్రానికింత ద్రోహం తలపెట్టినట్లు తెలిస్తే ఇంకేమైనా ఉందా?"

ఇలా ఆలోచనలు వచ్చేసరికి దాన్ని చెప్పేసి క్షమించమని ప్రాధేయపడాలనుకున్నాడు."

* * *

ఆ సాయంత్రం చంద్రం ఆఫీసునుంచి వస్తూనే 'రాజా నీతో ముఖ్యవిషయం చెప్పాలనుకుంటున్నా. అలా హోటలుకు పోదాం పద' అన్నాడు.

ఇద్దరూ హోటల్లో ఒక రూంలో కూర్చున్నారు.

"రాజా నువ్వు నన్ను క్షమించాలిరా. తప్పకుండా క్షమిస్తానంటె ఒక విషయం చెప్తా..."ఒకరోజున నువ్వు లేని టైములో నీ 'మిసెస్' దగ్గర్నుంచి ఒక ఉత్తరంవచ్చింది.

"దాన్ని చూడగానే చిన్నబుద్ధయింది."

దాన్ని చించి చదివా. అలాంటి ఉత్తరం ఈ జన్మలో నేను చూడలేనని దాన్ని దాచుకోవాలనుకున్నా. అయినా నీకు చెప్పకుండా నీ ఎదుట నిలవటానికి మొహం చెల్లలేదు ఇదిగో ఉత్తరం...నన్ను క్షమించు రాజా, క్షమించు" అంటూ ఉత్తరం రాజాకిచ్చాడు చంద్రం.

"చంద్రం నువ్వుకూడా" అంటూ రాజా ఏదో చెప్పబోయేంతలో—

"రాజా, నువ్వింకేం చెప్పకురా. నన్ను క్షమించావను చాలు" అన్నాడు చంద్రం.

తను చేసినపని చెప్పటానికి నోరు తెరచిన రాజా అలాగే ఉండిపోయాడు. ★

## శిక్ష

న్నట్లు నటించబోగారు.

"అందరూ చిరాకా నగలూ, డబ్బూ యిలా తెండి" అని గద్దించాడు. ఆ కంఠం విని, తేనెటీగ కుట్టినట్టు అందరూ ఉలిక్కిపడ్డారు.

చేతిలోని రివాల్వర్ దీపపుకాంతిలో మిలమిల మెరిసిపోతూంది.

అనుకోకుండా జరిగిన ఈ ఉపద్రవానికి అంతా విస్తుపోతున్నారు. గాభరా పడుతున్నారు. విచారిస్తున్నారు. మనసులో వెయ్యిదేవతలకు మొక్కుకుంటున్నారు.

"ఊఁ! ఆలస్యం చెయ్యకండి. లేకుంటే ఒక్కొక్కర్నీ కాల్చేస్తాను" అన్నాడు కర్కశంగా.

అందరూ గడగడలాడిపోయారు.

స్త్రీలు కొందరు నగలు చేతపట్టుకుని, యిద్దామా వద్దా అని సంశయపడుతున్నారు. మరికొంతమంది మెడమీద చేతులు వేసి, నగలు తీయకుండానే, తీస్తున్నట్టు నటిస్తున్నారు.

ప్రతి ఒక్కరి చెవులూ కనిపెడుతూనే ఉన్నాను.

కొంతమంది మగవాళ్లు పర్సులు తీసి వణుకుతున్న చేతులతో బల్లమీద పెట్టారు. మరికొందరు ఎటో చూస్తూ ఆలోచిస్తున్నారు. పసిపిల్లలు ఏడుపు లంకించుకున్నారు.

# దేవతా వస్త్రాలు





అనగా అనగా ఒక చక్రవర్తి. అందమైన బట్టలంటే చెవి కోసుకొనేవాడు. ఉన్నడబ్బు అంతా బట్టలమీదే పెట్టేవాడు.

ఒకరోజు ఇద్దరు మోసగాళ్లువచ్చి చక్రవర్తికి దేవతా వస్త్రాలు నేసి ఇస్తామన్నారు. కానీ తాముండే పదవికి అనర్హులైన వారెవరికి ఆ బట్టలు కనబడవని చెప్పారు. దానికి ఖజానాలోఉండే బంగారం వెండి కావాలన్నారు. చక్రవర్తి సంతోషంతో "ఇంతేనా" అని వెండి బంగారం అంతా వాళ్లకు ముట్టచెప్పారు.

కొన్నాళ్లకు చక్రవర్తి పుట్టినరోజు వచ్చింది. దేవతా వస్త్రాలు తేవలసిందని ఆజ్ఞాపించారు చక్రవర్తి. మోసగాళ్లు తయారైనారు చేతులాడించుకుంటూ. చక్రవర్తికి బట్టలు కడుతున్నట్టు నటించారు. రాజు కిక్కురుమనలేదు. ఏమైనాఅంటే తన ఉన్నతపదవికి భంగంకాదుమరీ!

కొత్తబట్టలతో ఊరేగుతున్నారు చక్రవర్తిగారు. ఊళ్లో ప్రజలంతా మెచ్చుతున్నారు రాజుగారి దేవతా వస్త్రాలను. ఇంతలో ఒక చిన్న పిల్లవాడు తన తల్లితో, "అమ్మా! రాజుగారు బట్టలు కట్టుకోలేదు!" అన్నాడు. వెంటనే మొదలుపెట్టారు జనం ఒకరి తరువాత ఒకరు "చక్రవర్తిగారు దిశమొలతో ఉన్నారు"....."అయ్యో చక్రవర్తి దిగంబరి"..... వ్యామోహంతో చక్రవర్తి ఇంటికి పరుగెత్తివెళ్లి, "నాకు తెచ్చిన అవమానానికి ఈ మోసగాండ్రను శిక్షిస్తాను" అన్నాడు.

చక్రవర్తికి జీవితంలో ఎక్కువ ఇష్టమైనది మోసగాండ్రకు తెలుసు. ఒక అందమైన ప్యారీ వారి బిళ్లల డబ్బా రాజుగారికి బహుమానం చేసారు మోసగాళ్లు. చక్రవర్తిగారు సంతోషంతో మోసగాళ్లని క్షమించి ఇంటికి పొమ్మన్నారు.

ఇవి:




**ప్యారీవారి** బిళ్లల



బహుమానంతో ఎప్పుడూ అందరినీ సంతోషపెట్టవచ్చు

**ప్యారీవారి బిళ్లలు ఎంతో రుచికరమైనవి,**
**శుభ్రమైనవి, పుష్టికరమైనవి. విడిగాగాని**
**ప్యాకెట్ల డబ్బాలలోగాని కొనుక్కోవచ్చు.**

తయారీ: ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు



# శశి హృదయం

శ్రావణి

"నాటికి మూడు దినాలుగా తనకు ఆతిథ్యాన్నిస్తూంది మెరీనా బీచ్. ముఖం తప్పించి విషయం చెప్పకుండా రోజులను ఎన్నాళ్లు దొర్లించగలడు? తను విద్యార్థిగా కాలం గడపగలిగినప్పటికీ ఇంట్లో గడిచేదెలాగ? అయినా జరిగిన సంగతి ఇంకా ఇంట్లో తెలియకుండా ఉంటుందా? తెలిసి తల్లి సొమ్మసిల్లి పడిపోయిందేమో? భార్య తనను ఆడిపోసుకుంటుందేమో? ముందు ముందు పదిమందిలోనూ తనూ ఒక మగవాడినని తలెత్తుకుని తిరిగేదెలాగ? జీవితం దుర్భర మనుకుంటూనే ప్రతిక్షణం గడిచిందిలేదు? అయినా తను మొదటినుండీ అలాటివాడు కాదుగా. నాటికి రెండురోజులముందు వరకూ తనసంసారం మూడు పువ్వులూ ఆరు కాయలూగా వుండటంతో ఇప్పుడు ఆ విషయం ఎవరికో, వాలి? పెళ్లినాడు తనకు ఎంతోమంది ఎన్నో కానుకలిచ్చేరు. ఇప్పుడు వీధుల్లో బికారిగా తను తిరిగితే సానుభూతైనా చూపెడతారా? ఎందుకు చూపెట్టరూ? అయ్యో పాపం! అని అంటారుగా. అంతే. అంతకంటే ఎక్కువైతే డబ్బు అప్పడుగుతానేమోనని తప్పించుకు తిరగడానికి ప్రయత్నిస్తారు. ఇదంతా తన భార్య అదృష్టమేమో. ఆమె ఏం జేస్తుంది? దీనికంతకూ తన తెలివితక్కువతనమే కారణం. భార్యను ఇంతవరకు తనేమీ చెప్పలేదు. తల్లిని భార్యను, ఈ దుర్వార్త చెప్పి దుఃఖింపచేసేకంటే ఈ సముద్రపు హోరులో కలిసిపోతే! తనమీద ఆధారపడుతున్నవాళ్లు కాబట్టి భార్య, తల్లి కొద్దిరోజులు ఏడుస్తారు. తరువాత కొన్నాళ్లకు వాళ్లే ఊరుకుంటారు. అభిమానంగల వాడికి మనుగడ దుర్భరమైతే ప్రతికాలని ప్రాకులాడేకంటే భస్మిస్తే మేలు! ఇప్పుడివన్నమనుకుంటే ఏం లాభం? అప్పుడు తన భార్యనంత కచ్చితం చెయ్యకపోతే ఇప్పుడు తనింత పరితపించవలసిన అవసరం లేకపోవును తనూ తొందరపడి వుండకపోవును—ఏది కొంచెం ఆలోచించుకునే అవకాశాన్నైనా ఇచ్చిందా తనతో టెంపరం. తను తిరిగి వాళ్లకేదైనా సమాధానం చెప్పగలిగితే, తనను గేలిచేసే ధోరణిలో వాళ్లు నవ్వుతుంటే తను సహించలేకపోయేవాడు. వాళ్లంతా మొదటినుండీ తనకెంతో కావలసిన వాళ్లలాగే సలహాలిచ్చేరు. ఇంతకూ అందరిమాటలను తోడగట్టుకొని తను ఈ విధంగా నిర్వాకం చెయ్యకపోతే తన బుద్ధేమయినది! సంఘంతోపాటు తనూ పోవలసినవాడే. కాని కొంచెం ఆలోచించి, అప్పటివాళ్ల సలహాను పెడచెవిని బెట్టినట్లయితే తనీనాడు బెంబేలు కావక్కరలేదుగా" మూడునెలలకు ముందు ఎంతో ఆనందంగా గడిచే జీవితాన్ని ఒక్కసారి మననం చేసుకుంటే అతనిలోని దుఃఖం పొంగి పొరలుతూంది.

* * *

పాండురంగారావు ఆశించినట్టుగానే అతనికి తగువుకున్న భార్య దొరకనే దొరికింది. అంతటితోపాటు తృప్తిపడనీయకుండా శశి తనతోపాటు నెలకు నూటఇరవై రూపాయలొచ్చే ఉద్యోగాన్ని తెచ్చుకుంది. ఉదయం ఆఫీసుకు వేళ అయ్యే వరకూ వంటపనిలో అత్తగారికి సహాయపడడానికి ప్రయత్నించేది శశి. కాని ముద్దుల కోడలి చేతులు మొద్దుబారిపోతాయేమోనని శారదాదేవి తనే స్వయంగా పని అంతా చేసుకునేది.

తొమ్మిది గంటలకల్లా భోజనాలు ముగించుకొని తములపాకులు వేసుకొని ఎరుపెక్కిన పెదవులు చూచుకు మురిసిపోతూ నవ్వుకుంటూ భార్యాభర్తలిద్దరూ శారదాంబకు "టాటా" చెప్పి బస్సులకు బయలుదేరేవారు అయితే ఆఫీసులు వేరువేరు కావడంమూలంగా బస్సుస్టాపుదగ్గర విడిపోక తప్పేదికాదు. సాయంకాలం ఐదుగంటలకల్లా పనిముగించుకొని శశి పాండుఆఫీసుకు వచ్చేది అక్కడనుంచి ఇద్దరూ కలిసి ఏ బీచ్‌కో సినిమాకో వెళ్ళి ఆఫీసు ఖబుర్లు చెప్పుకుంటూ కేరింతాలు

# శశి హృదయం

గొడుతూ ఇంటికి చేరుకొనేవాడు.

ఆరోజు లంచ్ టైమ్‌లో పాండు ఆఫీసు దగ్గర నిలబడి సిగరెట్ కాలుస్తున్నాడు. ప్రక్క ఆఫీసులో పనిచేసే స్నేహితుడు వెంకట్రావు అదే సమయానికి అక్కడకు వచ్చి నిలబడ్డాడు. స్నేహితులిద్దరూ కాసేపు ఆఫీసు విషయాలు మాట్లాడుకున్నారు. వెంకట్రావు అంతటితో పాండును వదలిపెట్టలేదు. "పాండూ నేను ఇలా అంటున్నానని నువ్వు మరోలా అనుకోనంటే చెబుతాను." వెంకట్రావు సంకోచించేడు.

"ఏమిటండీ? అయినా నువ్వు చెప్పే విషయం గురించి నే నేమనుకుంటాను? "పాండు నవ్వుతూ అన్నాడు.

"ఆఁ...ఏమీలేదు...నీభార్య ఉద్యోగం చేస్తేనేగాని నీకు గడవదా అని...?"

"అదేమిటోయ్ అలా అడుగుతున్నావ్!" ఆశ్చర్యంగా చూసేడు పాండు.

"కాను. నువ్వు సంపాదించే రెండు వందలూ మీ సంసారానికి సరిపోతాయిగదా. ఇంకా ఎందుకు ఆ అమ్మాయిని ఆఫీసులమ్మట తిప్పడం."

"సరిపోదాని కెక్కడరా! వచ్చే డబ్బు కాదని ఎవరనగలరూ, అయినా దానికీ సరదాగా ఉంది. ఎప్పుడు మానెయ్యాలనుంటే అప్పుడే మానేస్తుంది" పాండు చాల తేలికగా చర్చను ముగించేడు.

ఆ సంభాషణను ఇంక పొడిగిస్తే బాగుండదని 'సరే' నని అనుకుంటూ వెంకట్రావు ఆఫీసుకు వెళ్లిపోయేడు.

ఇంటిదగ్గర రాత్రి భోజనాలదగ్గర పాండు ఈ ప్రస్తావన తీసుకొచ్చేడు. తనకు ఉద్యోగం చెయ్యడం ఏమీ కష్టంగా లేదని కాలము సరదాగా గడచిపోతూందని శశి భర్తకు సమాధానం చెప్పింది. 'ఇంటిదగ్గర కూచుని ఏం చేయాలి? ఫరవాలేదు. దాన్ని ఉద్యోగం చెయ్యనియ్యి" అన్నారు శారదాంబగారు.

"ఈ వయస్సులో మీ అమ్మగారి చేత చాకిరీ చేయించడము, మీ ఆవిడను ఉద్యోగానికి పంపడము ఏమంత మంచిదికాదు. కోడలు వస్తుంది. విశ్రాంతి ఇస్తుంది. అని అబ్బురపడే మాతోటి పెద్దవాళ్లను ఈ పాటికి సుఖపెట్టాలి. మీ అమ్మగారుండగానే కొత్త వంటపని నేర్చుకుంటే తరువాత పిల్లాపీచు కలిగినా సంసారం తనంతట తను దిద్దుకోగలుగుతుంది. అటూ పక్కింటి భోగమ్మగారు మర్నాడు ఉదయం కాఫీ పొడి అప్పు తెచ్చి అదను చూసుకొని ఇచ్చిన సలహా పాండుకు మంచిదిగానే తోచింది.

ఆరోజు పాండు ఆఫీసుపనిమీద బ్యాంకుకు వెడుతున్నాడు. దారిలో శర్మ ఎదురయ్యాడు ఇద్దరు చిన్ననాటి స్నేహితులు కావడం. మూలంగా కలసి కాఫీహోటలుకు బయలు దేరేరు:

"ఒరే పాండూ ఇంక మీ ఆవిడను ఉద్యోగము మాన్పించి కొత్త నాలుగోడల మధ్య తోటి ఆడవాళ్లతో పాటు సంసారం దిద్దుకుంటూ ఉండమని చెబితే మంచిదేమోరా! నీకు నాకూ ఉండే ప్రాణస్నేహాన్ని పురస్కరించుకొని ఇంత మనస్సు విడిచి చెప్పగలుగు



# ఆమె చెమటకాయలతో ఎంతో బాధపడేది...

# జాన్సన్స్

## ద్వివిధ చికిత్స ఆమెకు స్వస్థత కలిగించింది!

చెమటకాయల వలన కలిగే దురదను మరియు అసౌఖ్యమును జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సోప్ మరియు పౌడరు వాటి మీద ఎంతో మంత్రముగా పోగొట్టగలవు! సౌమ్యముగా రోగనిరోధకమైన జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సోప్ మూసుకొనిపోయిన సూక్ష్మ రంధ్రములను శుభ్రపరచి వాటి వలన కలిగే చెమటకాయల అసౌఖ్యమును పోగొట్టును. చల్లదనమునిచ్చే జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరు మిమ్మల్ని ఎంతో హాయిగా ఉండేలా ఉంచుతుంది!







జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సోప్ మరియు పౌడర్—
వాటిని రెండింటినీ వాడండి!

[ జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

పెబల యెనకా నీకు
పేమంతె సెబుతాను...
పోదాము కోటప్ప కొండ
మామా
పదవోయి జంట నేనుండ.

కొండసుట్టూ తిరిగి
కోటి పెబలను సూసి
పెబల యెనకా నీకు
పేమంతె సెబుతాను. ॥

ముంతలో దాశాను మునలిదిచ్చినసొమ్ము
సంతలో కొనిపెట్టు సన్నగళ్ల సీర. ॥

నువ్వుండె నేనుండె
నువు నేను తెగపండె
నాకు నీకూ మద్దె
నలుసొక్కడుండాలి. ॥

పోదాము కోటప్ప కొండ
మామా
పదవోయి వెంట నేనుండ. ॥

—చెరువు ఆంజనేయశాస్త్రి.

అంతలో భోజనాలూ అయిపోయాయి. ఆడవాళ్ళు వంటగదిలోనే ఆ కబుర్లూ ఈ కబుర్లు చెప్పుకుంటూ వుండిపోయారు. లక్ష్మణరావు బయట వరండాలో పచార్లుచేస్తున్నాడు. రామచంద్రం లోపల్నించి కుర్చీ బయటికి లాగుకొంటూ "నీమీద పెద్దబాధ్యతే వేశాడు అన్నయ్య" అన్నాడు.

"మొత్తానికి గడుసువాడే తెలివైన పనే చేశాడు."

"అసలు విషయం తెలుస్తే అమ్మకగుల్తుందనా?"

"నాలుగురోజు లుండిపోవచ్చనుకున్నారు"

"అదేజరిగింది. ఎందుకో భయం వేస్తూంది"

"నీకేం భయమోయ్! బ్రహ్మచారివి. పైగా నేను లేనూ. సంసార బాధ్యతలు అనుభవంలో తెలుసుకో. ఎప్పటికయినా తప్పేది కాదుగా."

రామచంద్రం గొంతు తగ్గించి "నువ్వలాగంటే ఇప్పుడే పారిపోతా. అన్నయ్యనూ నే వినవివాళ్ళు నన్ను లెక్క కడతారు. కుర్ర వెధవకింత తొందరపాటెందుకూ" అన్నాడు. అతనికి నవ్వూ వచ్చింది.

"రాధమ్మ చదువుకున్నది. ఆమె సులువుగా అర్థం చేసుకోగలదు. ఆమెకు నే నన్ని చెబుతానుగా. మొత్తానికి ఇది చాలా సున్నితమైన వ్యవహారం."

"అందుకే నీమీద మరొక పెద్ద బాధ్యత పడిందన్నాను."

వంటగదిలో పని పూర్తి చేసుకుని ఆడవాళ్ళు ఇవతలికి వచ్చారు. లక్ష్మమ్మగారు ముందు అందంగా ఎదిగి పూలు పూసిన మొక్కలని చూసి మురిసిపోతూ 'చాలా బాగుంది నాయనా యిల్లు. అద్దె పోతే పోయింది. సుఖంగా సదుపాయంగా వుంది. అదే అంటాను నేను. అందుబాటులో ఉన్నంతవరకూ అనుభవించాలి. ఊరికే అణా పైసల దగ్గర్నించీ లెక్కలేసుకుంటూ కూర్చుంటే జీవితమంతా నరకంలా వుంటుంది. ఏమంటావు నాయనా" అన్నారు గోడవార జానకమ్మ పరిచిన చాపమీద కూర్చుంటూను. జానకమ్మ రాధ వరండా చివరికి వెళ్ళి ఎత్తుగా పల్లాలుగా ఉన్న వీధుల్ని చూస్తూ నిలబడ్డారు. ఇంటి ఎదురుగా వున్న ఖాళీ స్థలంలో ఒక పెద్ద గుండ్రటిరాయి నిలబడివుంది. ఎండపొడకి నల్లగా మెరుస్తూంది. రాధ ఉత్సాహంగా ఆ రాయివైపు చూస్తూ "ఈ వూరు తమాషాగా వుంది అక్కా. అన్నీ మిట్టపల్లాలే. బళ్ళు లాగలేక ఎద్దులు ఒగరుస్తుంటే జాలివేసింది పాపం" అంది.

లక్ష్మమ్మగారు వ్యక్తం చేసిన అభిప్రాయానికి ఏ సమాధానం ఇవ్వకుండానే లక్ష్మణరావు నవ్వి ఊరుకుని మనసులోనే అనుకున్నాడు. 'ఇలాంటి భావాలు కొంతమందికి ఉండబట్టే అనేకుల జీవితాలు నాశనం అయిపోతున్నాయి. అందినంత వరకూ అనుభవించడమే ధ్యేయంగా పెట్టుకుని మరొకరి గురించి ఆలోచించని వ్యక్తులు కేవలం స్వార్థపరులు. బాధ్యతా రహితులు. వారు ముందు చూపులేని గ్రుడ్డివారు కూడాను' ఈమె ధోరణిలో ఎదుటివాళ్ని ఉద్రేకపరిచే లక్షణా లున్నాయనీ, అవి ఎదుటివారిని దాసోహమనిపిస్తాయనీ కూడా అతననుకున్నాడు.

"పిల్లల్ని చూడాలని మహా ఆత్రుతగా ఉంది. వీళ్లు పొద్దు పోయిగాని రారు కాబోలు. పోనీ ఇవ్వాళ బడి మానిపించలేకపోయావా నాయనా?" అన్నారు లక్ష్మమ్మగారు.

"వస్తారు. సాయంత్రం అయిదున్నరకల్లా వచ్చేస్తారు. బడిమానమని నేనెలా అనగలను. ఆ విషయాలన్నీ మీ అమ్మాయి అధికారం కింద వుంటాయి. వాళ్లని బడి మానిపించడం అంటే ఆవిడకు సుతరామూ పనికిరాదు. ఆ ప్రశ్న ఆవిణ్ణే వెయ్యండి."

"ఇదేమిటి నాయనా అలాగంటావు నా బిడ్డ అంత స్వతంత్రంగా ఉండే పిల్ల కాదు. దాని స్వభావం నాకు తెలియదూ. నువ్వు చల్లగా చేసేవన్నీ చేసి చివరికి దానిమీదికి నెట్టేస్తుంటావు. మా అమ్మాయి అమాయకురాలు కాబట్టి ఊరుకుంటూంటుంది. రాధమ్మలాంటి దయితే నీ ఆటలు సాగేవి కావు."

"అబ్బో ఈవిడ రాధమ్మ కంటె రెండాకులు ఎక్కువే చదివింది."

(ఇంకావుంది)

"ఇంద బస్సు శ్రీరంగం......" వచ్చీరాని అరవంలో తడబడుతూ అడిగాడు రాజారావు, తిరుచినాపల్లి జంక్షను బస్సుస్టాపులో నుంచుని సిగరెట్ పీకను బూటు కాలితో నలుపుతూ.

కండక్టరు నవ్వుతూ "ఎక్కండి" అన్నాడు.

అమ్మయ్యా తెలుగు తెలిసిన కండక్టరు. బస్సు ఎక్కడమూ, అది కదలడమూ ఒకే సారి జరిగింది. బస్సు గుమ్మం దగ్గరనుంచి సీటులో పడ్డాడు రాజారావు. ఢభీమన్న శబ్దం విని. ఆ మూల సీటులో కూచున్న అమ్మాయి వెనక్కు తిరిగి చూసి నవ్వుతూంది. సిగ్గుపడ్డాడు రాజారావు. కళ్ళు మూసుకున్నాడు, ఓ క్షణకాలం. కనుకొలకుల్లోంచి ఆ అమ్మాయివేపు చూశాడు. ఇంకా నవ్వు ఆమె పెదవుల చివర్లను వెలిగిస్తూంది. చెక్కిలు ఎర్రబడాయి. తెల్లటి జార్జెట్ చీరా, నల్లని షిఫాన్ జాకెట్ అతని కళ్ళను చెదరగొట్టి వెక్కిరించాయ్. ఆమె తల్లోని మందార పువ్వులు నవ్వాయ్.

"మూడణా ఇవ్వండి"

కండక్టరు మాటతో మామూలు మనిషయ్యాడు రాజారావు. మూడణాలందిస్తూ "నీకు తెలుగెలా వచ్చు?" అని అడిగాడు.

"గుంటూరులో నాను ఒరు వరండా పనిచేస్తిని" కండక్టరు నోట్లో తెలుగు దాదాపు ఖూనీ అయ్యింది.

తన్ను చూసి నవ్విన అమ్మాయి వేపు చూడకుండా వుండాలని పెద్ద ప్రయత్నం చేసి విఫలుడయ్యాడు రాజారావు. ఓరగా చూశాడు. ఏదో పుస్తకం తీసి దీక్షగా చూస్తోంది. బస్సులో కండక్టరు, ఆ అమ్మాయి, రాజారావు తప్ప ఎవ్వరూ లేరు. శ్రీరంగం వెళ్లేదాకా ఎవ్వరూ ఎక్కకపోతే బావుణ్ణనుకున్న రాజారావు ఆలోచనలకు బ్రేకులు పడ్డాయి, ఇంకో బస్సు స్టాపులో.

"కజ్ఞాస్పటల్" అని అరిచాడు కండక్టరు. ఎవ్వరూ దిగలేదు. నలుగురెక్కారు. బస్సు కదిలింది. ఎక్కిన నలుగురూ కట్టబొమ్మన అనుయాయుల్లా దిట్టంగా వున్నారు. తాంబూలపు గుంపర్లతో సహా వాళ్ళనోట్లోంచి వెలువడుతున్న మాటలు ఆటంబాంబులా పేలుతున్నై.

బస్సు కావేరీనది కడ్డు వంతెనమీది నుంచి పోతుంది. సాయంత్రం నీరెండ నది నీళ్ళమీద వింత కాంతుల్ని సృష్టిస్తూంది. అక్కడక్కడ పైకి కనిపించే ఇసుకతిన్నెలు పసిడి రేణువులచే కప్పబడిన భ్రాంతిని కలుగచేస్తూ నేత్రపర్వంగా వున్నై.

'కావేరి నీ వేరిగా చేయునే...' రామకృష్ణ కవి ప్రాంతీయాభిమానంచే అలా అన్నాడు కానీ అంతఅందమైన కావేరిని సముద్రుడు కాదంటాడా.

తను వచ్చి వారం రోజులే అయింది, విజయవాడనుంచి. రోజు రోజుకు శ్రీరంగం అద్భుతంగా కనిపిస్తూంది, రాజారావుకు.

వంతెన దాటింది బస్సు. కొబ్బరచెట్ల వరుసలూ, అరటి తోటలూ, వీటిమధ్య పంజ చీకట్లలో దీపాల తోరణాలతో మెరుస్తున్నది శ్రీరంగం. "చని కాంచెన్ విరజాభిదాంతర వపుః......శ్రీరంగమున్" కావేరీ తీరంలో వుంది. దట్టమైన చెట్ల ఆకుల సందుల్లోంచి పడే ఆలయ ప్రాకారాల, బంగారు శిఖరాల కాంతులు సంపెంగ పూలలాగా...

...రాజారావు ఆలోచనలో పడ్డాడు. ఈ పద్యం ఆముక్తమాల్యదలోది. రైలు గేటుముందు బస్సు నిలిచింది.

రాజారావును జంక్షన్ బస్సుస్టాపు దగ్గర బస్సులో చూసి నవ్విన అమ్మాయి వొయ్యారంగా దిగుతోంది.

"ఉండరే గొంతుక లోన కొట్లాడుతాది" అయింది రాజారావు పరిస్థితి. బస్సు దిగాడు.

ముందు వెళ్తున్న అమ్మాయి నున్నని, తెల్లటి చెంపలమీద, వొంపులుతిరిగి భుజాల మీదా వీధిలోని విద్యుద్దీపాల కాంతులు పడుతున్నై. ఆ అమ్మాయి ఒక యింటిముందాగింది. రోడ్డుపక్కనే వుంది ఆ ఇంటికి గేటు. గేటుమీద పూలపందిరి. అక్కణ్ణించి సన్నని కాలిబాట. రెండువైపులా ఎత్తైన కొబ్బరచెట్లూ, పూలచెట్లూ వీటి వెనకాల రెండంతస్తుల మేడా. రాజారావువేపు యాదాలాపంగా చూసి నవ్వుతూ లోపలకు పోయింది. తనింకో రెండ్రోజులు వుండాలి. ఈ లోపున ఆమె పరిచయం.

రాజారావు అందమైన వూహాలకి ఆలోచనలు పూలరేకుల్ని తొడిగాయ్. ఆమె యింటికి నాలుగోయింటి మేడమీది గదిలో అద్దెకుంటున్నాడు, రాజారావు.



రూముకెళ్ళి తలుపుతీయగానే క్రింద పడున్న ఉత్తరం చూశాడు. తీసి చదివాడు. బెజవాడనుంచి ఆచార్యులు రాశాడు. ఆచార్యుల ఉత్తరాలు చదవటం చాలా సరదా. చమత్కృతీ, హాస్యమూ అడుగడుగునా కనిపిస్తై. "కావేరీనదీ తటానికి స్నానార్థమై వొచ్చిన అయ్యంగారు — కన్యాసహ ప్రస సౌందర్యవీక్షణ పరవశుడైన రాజారావు" అని రాశాడు ఉత్తరం. చదివి చదివి నవ్వుకున్నాడు రాజారావు. దగ్గరే సుందర భవన్‌లో భోజనం. మేడమీద గదులు తన ద్దికిచ్చినవాళ్ళు క్రింద వుంటున్నారు. చాలా సౌమ్యులు. రోజూ తొమ్మిదిన్నరకే భోంచేసి టెర్రేసు మీద పడకకుర్చీలో కూచుని చంద్రబింబంవంకో, నీలాకాశం వేపూ, కొబ్బరిచెట్ల ఆకుల్లోంచి పడుతున్న చంద్రకాంతి కిరణాలవంకో చూస్తూ గంటల తరబడి గడిపేవాడు.

బస్సులో తన్ను చూసినవ్విన అమ్మాయిని గురించి ఆలోచించి కళ్ళు మూశాడు. తను విజయవాడనుంచి వచ్చేటప్పుడు అందమైన అమ్మాయిలసలే మెసలే శ్రీరంగంలో జాగ్రత్తోయ్ అంటూ టీచ్ చేశారు. ఇక్కడికి వచ్చాక నిజమే అనిపించింది. పసిడి కాంతులు, విశాల వినీల నేత్రాలు, సుదీర్ఘ శిరోజసంపదా, పుష్టిపుష్ట సుస్నిగ్ధ కపోలాలు ఇక్కడి అమ్మాయిల సొమ్ములాగున్నై. శ్రీరంగం దేవాలయంలో వున్న సుందర స్త్రీ విగ్రహాల సమునిధిక్కాంగ ప్రేక్షణీయ సౌందర్యం ఇక్కడి స్త్రీలలో కనిపిస్తూంది. దక్షిణదేశ దేవాలయాల్లోని శిల్పాలంతటి సుందరంగా వుండడానికి కారణం బహుశా శిల్పాల్ని నిర్మాణించేటప్పుడు శిల్పుల మదిలో స్థానిక స్త్రీల సౌందర్య సంపద మెదిలి వుంటుంది. ఎడతెరిపి లేకుండా అలా సాగేవి రాజారావు ఆలోచనలు. తన నిర్జీవమైన ఆలోచనలకే అంతటి కమనీయ కవితాశక్తిని ప్రసాదించిన ఆ కన్నెయెడల రాజారావు హృదయం అనురాగపూర్ణం అయింది.

ఎలాగైనా ఆమె పరిచయం సంపాయించాలనే నిశ్చయంతో తృప్తిగా నిద్రపోయాడు రాజారావు.

* * *

మర్నాడు పొద్దున్నే తొమ్మిదిన్నరకు హోటల్లో భోంచేసి బస్సుస్టాపుదగ్గర కెళ్ళిన రాజారావు కళ్ళు జిగేలుమన్నాయ్. ఆమె చీరధరించిన వైఖరీ, నిలుచున్న తీరూ, చూపుల్లో వెలిగే ఇంద్రధనుస్సూ అతనికి దిగ్భ్రాంతిని, కలంగ చేశాయ్.

**ఆమె పరిచయం కావాలని తొడ్పింది**

# ★ మధుర మీనాక్షి ★

పట్టుకుని 'ఎంత గొప్పగా చెప్పారండీ," అంది.

రాజారావు సిగ్గుపడ్డాడు. విరజ స్నేహితురాండ్రు అడ్మైరేషన్‌తో రాజారావు వేపు చూశారు.

బస్సు స్టాపు దగ్గర కెళ్ళి నిలుచున్న ఐదు నిముషాలకు బస్సు వచ్చింది జనంతో కిటకిటలాడుతోంది. అతికష్టంమీద కూచోగలిగారు. శ్రీరంగం వెళ్ళేదాకా ఒకరితో ఒకరు మాట్లాడడానికి వీల్లేకపోయింది. మామూలు స్టాపు దగ్గర బస్సు దిగారు. విరజ స్నేహితురాండ్రు సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

రాజారావు విరజా కలిసే నడిచారు.

ఇద్దరి హృదయాల్నీ ఆ విమాన గోపుర దర్శనం కదిల్చింది.

అనంత విశ్వసౌందర్యం అద్భుతంగా కనిపించసాగింది. రోడ్డుకు రెండు వేపులా వున్న పూలచెట్ల మీదనుంచి వస్తున్న పరిమళ తరంగాలు హాయిగా వాళ్ళను స్పృశిస్తున్నాయి.

రెండడుగులు తనకంటె ముందుగా నడుస్తున్న విరజకేసి చూశాడు, రాజారావు. శ్రీరంగం ఆలయ కుడ్యం మీది అద్భుత శిల్పమొకటి సప్రాణంగా తనముందు నడుస్తున్నట్టు ఫీలయ్యాడు. సుందరమైన ఆమె భుజాల దగ్గర విశాలమై నడుము దగ్గర అతి సన్ననై, జఘన భాగం దగ్గర మళ్ళీ విశాలమైన ఆమె శరీరపు వొంపుల్నీ, మిట్టపల్లాల్నీ కప్పుతున్న కనకాంబరం చీర ధరించిన ఆమెను చూట్టంవల్ల పులకితుడైనాడు రాజారావు. ఆమెలో కొత్త అందాలు వికసించాయి. కొత్త సౌరభాలు గుబాళించాయి. నడవలేకపోయాడు. అక్కడే కూచోవాలనిపించింది.

రోడ్డుపక్కనే వున్న ఆమె యింటి గేటు ముందు నుంచుంది.

"రండి" అని పిలిచి ముందుకు నడిచింది.

పూలచెట్లపక్కన సన్నని కాలిబాటమీద నడుస్తూ ఆమెను అనుసరించాడు.

ఎత్తైన కొబ్బరిచెట్ల ఆకుల్లోంచి గద్దె వెన్నెల పడుతోంది. రెండు కొబ్బరిచెట్ల మధ్య, పూలమొక్కల పక్కగా వున్న సిమెంటు బెంచీదగ్గర నుంచుంది రాజారావుకు అభిముఖంగా విరజ.

వెలుగుచీకట్ల మధ్య రాజారావు ముఖం అందంగా మెరుస్తూంది.

అప్రయత్నంగా రాజారావును కౌగిలించుకుని "మీరు నా కెందుకు పరిచయమయ్యారు" అని వెక్కి వెక్కి యేడ్చింది. అప్రతిభుడైనాడు రాజారావు. అతని కన్నులు తిరిగాయి ఆమె నడుంచుట్టూ చేతులు వేసి చెంపల్ని నిశ్శబ్దంగా చుంబించాడు. అతని కౌగిల్లో ఆమె కరిగి నీరై వాగై ప్రవహించింది. ఆ ప్రవాహంలో చిక్కి వూపిరి సలిపింది కాదు రాజారావుకు

ఆమె వినీల నేత్రాలలోకి చూస్తూ "ఇది కలవు కాదు విరజా" అన్నాడు. "నీలాంటి స్నేహమయి, ప్రేమమయితో స్నేహాన్ని కూర్చిన భగవంతునికి ఋణపడి వున్నాను"

విరజ అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ "రేపు ఇంటిల్లపాదీ మధుర వెళ్తున్నాం. నా కజిన్ పెళ్ళి. మీరూ రండి ట్రెయిన్లో. మేము కారులో వెళ్తున్నాం. మీరూ వస్తే అక్కడ కలుసుకోవచ్చు" అంది విరజ.

"అలాగే" అన్నాడు రాజారావు

అతికష్టంమీద ఇద్దరూ విడిపోయారు.

* * *

మర్నాటి రాత్రి జంక్షనులో మధుర వెళ్ళే త్రివేండ్రం ఎక్స్‌ప్రెస్‌లో కూచున్నాడు. కంపార్టుమెంటులో జనం బాగా వున్నారు. రాజారావు కూచున్న సీటుకు ఎదురుగా వున్న స్థలాన్ని ఒక తమిళకుటుంబం ఆక్రమించుకుంది. మధ్యవయస్కులైన భార్యాభర్తలు యౌవనప్రాంగణంలో అడుగుపెట్టిన కొడుకు, స్కూల్లో వున్న యిద్దరమ్మాయిలు. కుటుంబ యజమాని రాజారావుతో తమిళంలో పలకరించాడు. తనకు తమిళం రాదని, తెలుగువాణ్ణని చెప్పిన రాజారావును, ఆయనభార్య తెలుగులో పలకరించింది. తమది మద్రాసని, మదరాసులో తమ యిరుగుపొరుగిళ్ళలో తెలుగు కుటుంబాలున్నాయని, తనకు తెలుగు వచ్చని చెప్పింది ఆమె

రాజారావు నవ్వి [illegible] చాడు.

వాళ్ళ పెద్దమ్మాయి రాజారావుదగ్గర వున్న ఇంగ్లీషు పుస్తకాలు అడిగితీసుకుంది.

పడుకోటానికి స్థలం లేదు. కూచునే కునికిపాట్లు పడుతున్నారు ప్రయాణీకులు.

కాసేపు కళ్ళు మూసుకుంటూ, కాసేపు కిటికీలోంచి చీకట్లోకి చూస్తూ కూచున్నాడు రాజారావు.

పొద్దున్నే నాలుగన్నరకు రైలు దిండిగల్లు చేరింది. ముఖం కడుక్కుని కాఫీ తాగివచ్చి కూచున్నాడు రాజారావు. సూర్యోదయసమయానికి రైలు కొడైకెనాలు ప్రాంతాన పోతూంది.

దూరాన కొండ అంచులు బంగారు కాంతుల్లో మెరుస్తున్నై. కొండకొమ్ముల మీదుగా మబ్బులు పరుగిడుతున్నై. కొండలోయల్లో మబ్బులనీలి నల్లగా కనబడుతున్నై. ఏది కొండ అంచులో ఏది మేఘాల అంచులో తెలియటంలేదు.

గాంధీగ్రామ్ మీదుగా పోతున్నది రైలు. చెట్లమధ్య గడ్డికప్పుల చిన్న కొంపలూ, సన్నని కాలిబాటలు రోడ్డు కిరువైపులా కొబ్బరిచెట్ల వరుసలూ రాజారావుకు మరో మధురలోకాన్ని స్ఫురింపచేశాయి.

విరజ ద్వారా విశ్వసౌందర్యరహస్య మార్గాలు తన కిపుడిప్పుడే తెలుస్తున్నాయి అనుకున్నాడు రాజారావు రాజారావు హృదయం ఆనందనిలయం అయింది. మధురనగరం సమీపించింది. మధుర స్వాగతమిచ్చింది.

స్టేషను వెయిటింగ్ రూములో స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు. అక్కడికి దగ్గరగా వున్న హోటలులో టిఫిను ముగించి సరాసరి ఆలయం వేపు బయల్దేరాడు. ఎత్తైన ఆలయగోపురం దూరాన్నుంచి కనిపించసాగింది. ఆలయం సమీపించాడు గోపుర ద్వారందగ్గర విరజ నుంచుని వుంది.

తొమ్మిదిన్నర అయినా ఎండ తీక్షణంగా వుంది. విరజ చెక్కిళ్ళు బాగా ఎర్రబడ్డాయి రాజారావును చూసి నవ్వింది.

"వచ్చారా" అంటూ లోపలకు దారితీసింది విరజ. ఆమెను అనుసరించాడు.

బ్రహ్మాండమయిన ఆలయం. లోపల కాలమైన వేయి స్తంభాల మండపం, గోపురం మీద అలంకుడ్యాలమీద మండపస్తంభాల మీద చెక్కబడ్డ అద్భుత శిల్పఖండికలు.

జనసమ్మర్దంలో విరజ తన్నంటిపెట్టుకుని నడిచింది. విరజపాండిత్యమూ, అలనాటి వాతావరణమూ, జనసమ్మర్దమూ కొత్తలోకంలో, ఏ స్వర్గమైన వాతావరణంలో విహరిస్తున్న భ్రమను కలగచేసింది.

లోపల పెద్ద కోనేరు. కాళ్ళు మొహం కడుక్కోటానికి మెట్లమీదుగా కిందికి దిగారు.

పాదాల మీద జరీ అంచు చీరను కొంచెం పైకెత్తి నీళ్ళలో మునిగిన మెట్టుమీద నుంచుని మొహం కడుక్కుంటున్నది, విరజ. పైకి ఆకుపచ్చగా కనిపించే నీళ్ళలో తెల్లతామరలా ఆమె పాదాలు మెరుస్తున్నై. స్వచ్ఛంగా [illegible] పడుతోంది.

రాజారావు తన పాదాల వేపు చూస్తుండటం గమనించిందేమో విరజ దివ్యమైన పాదాలు పైకి తీసుకుందిప్పుడు. దాదాపు పదకొండు గంటలయింది మీనాక్షి దర్శనం చేసుకున్నారు. ఆలయ ప్రాంగణాన్ని వొదిలి వెళ్ళాలనిపించలేదు. కోనేటిగట్టున నల్లని నీడలో కూచున్నారు. ఎంతో గొప్ప శిల్పకళా నైపుణ్యము. ఇది తెలుగు నాయక రాజులు కట్టించిన ఆలయం. రాజారావులో ఆంధ్రత్వం వుప్పొంగింది. నాయకరాజుల కాలనాటి సాహిత్యమూ, శిల్పకళా, అందుకున్న వున్నత ప్రమాణాలు, విజయవిలాస గ్రంథాలు, ముద్దుపళని, రంగాజమ్మలాంటి కవయిత్రులూ... రాజారావు హృదయాంబరంలో నక్షత్రాల్లా తళతళ కాంతిపుంజాలు ఘనీభవించాయ్. సంభాషణమనుకున్నా విరజ వచ్చిపోయే యాత్రికుల్ని చూస్తూ కూచుంది.

రాజారావు ఆమె వేపు చూశాడు.

ఆ క్షణంలో తన దగ్గర కూచున్న విరజ తన నేత్రాల్ని మహా గోపుర సౌందర్యం వేపు తిప్పింది. తన హృదయభాండాన్ని మధురిమతో, అమృతభావనలతో నింపిన విరజ, కొన్నాళ్ళకు కేవలం జ్ఞాపకమవ్వగ స్మృతిపథంలో నిలిచిపోతుంది. ఇంతగొప్ప వాతావరణం విచ్చిపోయి కేవలం కలలా మిగిలిపోతాయి ఈ ఆలోచనలతో రాజారావు కన్నులు చెమ్మగిల్లాయ్.

దాన్ని గమనించిన విరజ తన్మయత్వం కారణమనుకుంది. ఆప్యాయంగా రాజారావు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంది.

ఇద్దరూ లేచారు. ఆ మహాద్వారం దాటి బయటికి వచ్చారు. మధ్యాహ్నం పన్నెండు గంటలు. ఎండ నిప్పులు చెరుగుతోంది, గాలి వేడిగా వీస్తోంది.

"అబ్బ, ఎండలు మండిరాయి" అంది విరజ.

"దేనికోసం, ఎందుకు నీకీ శ్రమ"

"తప్పే, నేను శ్రోతను కనక. ఏనాడూ ఎరగని వుత్సాహం నన్ను కలుగుతోంది నాకు."

కాలేజి కాంటీన్ దగ్గరికి వచ్చారు, భోజనం ముగించి తిరుమల నాయక మహాలు చూటానికి బస్సులో వెళ్ళారు. రెండు గంటలు గడిపారు. మహాలు ముందు చెట్ల నీడలో కూచుంది విరజ. బాగా అలసిపోయింది. రాజారావు ఆమె పక్కన చతికిలపడ్డాడు.

అలా ఓ అరగంట కూచున్నారు. కాస్సేపటికి, రాజారావు లేచాడు. అతని చేతిని వూతగా తీసుకొని లేచి నుంచుంది విరజ.

చుట్టుముట్టిన గైడ్లను తప్పించుకొని ముందుకు సాగిపోయ్యారు. లోపల జనసమ్మర్దం. చాలాచోట్ల విరజ రాజారావు చేయిపట్టుకుని నడిచింది. దర్బారు మహలూ, అంతఃపురమూ అన్నీ చూస్తూ మెట్లమీదుగా పైకి వెళ్ళారు. పైనుంచి చూస్తే మిడిమోంపలో మిల మిలా మెరుస్తోంది మధురానగరము. వైగనదీతీరమూ, వున్నత భవనాలు, పురవీధులూ, మీనాక్షిదేవి ఆలయ గోపురం చూస్తూ నిలబడిపోయాడు రాజారావు.

విశ్వనాథవారి ఏకవీర, గణపతిశాస్త్రి గారి మీనాంబిక నవలలు జ్ఞాపకానికి వచ్చాయి. ఆ కాలంలోని రాజకీయ, సాంఘిక వాతావరణమూ, రాజుల తీరు అభివర్ణితాలయ్యాయి, ఆ నవలల్లో వాటిని గురించి చెప్పాడు విరజకు ఇంగ్లీషులో. రాజారావు వర్ణనా చాతుర్యమూ, ఆంగ్లభాషా మాధుర్యమూ విరజను ఆకట్టింది. మంత్రముగ్ధ అయి మళ్ళీ రాజారావు వెంట నడిచింది.

మహాలు సమగ్రంగా చూసేటప్పటికి సాయంత్రం ఆరుగంటలయింది. హోటల్లో కాఫీటిఫిన్ ముగించి వైగనదీతీరానికి నడిచారు.

నది తీరాన్ని సమీపిస్తున్న కొద్దీ నదీ తీరాల సమ్మోహనంగా వీస్తున్న గాలి హాయిగా స్పృశించింది.

"చల్లగాలి ఆహ్వానిస్తున్నది మనల్ని" అన్నాడు రాజారావు.

విరజ మాట్లాడలేదు. మౌనం వహించింది.

ఆమె వేపు చూశాడు. మొహంలో యేదో గాంభీర్యమూ, కళ్ళల్లో యేదో నిర్ణయమూ గోచరించింది. చకితుడైనాడు రాజారావు.

ఇంతసేపూ, చలాకీగా, సరదాగా, వున్న విరజ మొహంలో గాంభీర్యమూ ఆమె నిశ్శబ్ద మౌనం రాజారావులో ఆతృతను ఆందోళనను కలిగించాయ్.

వాళ్ళకు దగ్గరగా మనుష్యులు తిరుగుతున్న అలికిడి లేదు. విరజ వీపు మీద చేయి వేశాడు రాజారావు. ఆమె అతనికి మరింత దగ్గరగా నడిచింది. ప్రవాహానికి కొంచెం దూరంలో మెత్తని తెల్లని ఇసుకమీద కూచున్నారిద్దరూ.

కొంచెం దూరంలో చాకలి వాళ్ళు బట్టలుతుకుతున్న శబ్దం వినవస్తోంది.

నీటిమీద కొంగలు బారులు బారులుగా ఎగురుతున్నై. అనంతాకాశం నిర్మలంగా వుంది. వేడిచెందిన లోకం సాయంత్రం బాగా చల్లబడ్డది.

అస్తమిస్తున్న సూర్యుడి కాంతులు నీటిమీద వివిధ కాంతుల్ని సృష్టిస్తున్నాయ్. సంధ్యారాగంలో జగమంతా ఇంద్రజాలంలా వుంది.

రాజారావు కాళ్ళు బారచాచి ఇసుక మీద వెల్లకిలా పడుకున్నాడు, ఆకాశంలోకి చూస్తూ.

దగ్గరగా కూచున్న విరజ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు రాజారావు.

విరజ పాడింది. ఆమె గానంలో నించి బహిర్గతమైన అమృతప్రవంతి రాజారావును ముంచేసింది. ఆమె పాట వినడానికి వైగ నది, సంధ్యా ఆగాయి అనిపించింది. ఆమె పాటలోని ప్రతి పదమూ కాంతిదీపాలా ఆ అద్భుతమైన సాయంత్రాన్ని వెలిగించింది.

రాజారావు లేచి నుంచున్నాడు. ఆవేశంతో వొణుకుతున్న విరజను లేవనెత్తాడు. దూరాన మనుష్యులు కనిపించటం లేదు. ఆమెను కౌగిలించుకున్నాడు రాజారావు. ఆమె శ్వాస వెచ్చగా తగులుతోంది.

దూరాన మీనాక్షిదేవి ఆలయంలో కొడుతున్న గంటల శబ్దం వినవస్తోంది.

విరజలో ఆనందమో, విషాదమో తెలియని ద్వంద్వభావం, మనసు కలచివేస్తోంది.

ఒకటు, రెండు కన్నీటిబిందువులు ఆమె చెంపమీద జాలువారాయి.

"విరజా, భగవంతుడు ప్రసాదించిన వరానివి నువ్వు, నాకు. వచ్చేయేడాది మనం నాతో. తమిళదేశపు అలనాటి శిల్పసౌందర్యం, ప్రకృతి అందాలూ, నీ కమ్మని పాటల నీలినీడల్లో చూసుకుంటూ జీవితం గడపాలని వుంది." అన్నాడు రాజారావు ఉద్విగ్నతతో.

"వస్తాను. ఎంతదూరమైనా, యెక్కడికైనా వస్తాను మీతో" ఆమె మాట్లాడలేకపోయింది. దుఃఖం ఆమె కంఠాన్ని రుద్ధం చేసింది.

"మీనాక్షిదేవి నాకు మతిని ప్రసాదించింది." అంటూ చటుక్కున రాజారావు పాదాలు పట్టుకుని కళ్ళకద్దుకుంది. వాళ్ళ సంభాషణ వినడానికి ఆగిన వైగనదిఇక తృప్తిగా సాగిపోయింది. సంధ్య చీకటిలా ముందుకు సాగింది. చీకట్లో, విద్యుద్దీపాల వెలుగులో, వెలుగు నీడల్లో విరజా, రాజారావు మధురపురవీధులగుండా ఆలయాభిముఖులై వెళ్ళారు.

విరజ దాదాపు సగందూరం రాజారావు భుజాలమీద వాలి నడిచింది.

లోకంమీద చీకటి తెర మెల్లగా జారుతోంది.



గదినుంచి మాట్లాడుతున్న స్నేహితురాలివంక అర్థంగానట్లు చూస్తూ అంది సుమిత్ర. హాయిగా లక్షణంగా అన్నీ వున్న భర్త దొరికినా సుఖపడలేని అరవింద తన దగ్గర వుద్యోగంచేసి సుఖపడగలదా? యే కారణాలవల్ల తనీ నిశ్చయానికి వచ్చానని చెప్పిందో అరవింద ఆ కారణాలు అంతగా లెఖ్ఖ పెట్టవలసినవిగా కల్పించలేదు సుమిత్రకి.

'నాన్న యేమంటారు—తెలుసుగా—నామాట కాదనరని. అతన్ని క్యాంప్‌నుంచి రానీ వుత్తరం రాస్తాను అన్నారు. డబ్బుతోను, హోదాతోను తనలాగ అందరూ తృప్తిపడరని అతనికి తెలిసి రావాలి." మొహం పైకెత్తుతూ అంది అరవింద.

"సరే—కాని మరి—పోస్ అయితే ఖాళీ వుందనుకో. అయినా యీ వెల్ ఫేర్ బోర్డు నీలాటి సుకుమారికి పనికిరాదని నా వుద్దేశం—నీ కివ్వబోయే పోస్‌కి నీకు జీపు అది యిస్తారు. నువ్వు వూళ్ళన్నీ తిరగాలి. మరి తిరగ్గలవా?"

"యెందుకు తిరగలేను? నేను మటుకు నీలా కావాలా?" స్నేహితురాలి కళ్ళలోకి చూస్తూ అంది అరవింద.

"యెలా అవుతావు? నేనే నువ్వయితే హాయిగా శేఖరం చెప్పినట్లు విని—యింట్లోనే వుండేదాన్ని—" నవ్వుతూ అంది సుమిత్ర. అరవింద మొహం తిప్పేసుకుంది. సుమిత్రకి తను అర్థంగాలేదు. శేఖరం ఒక్క పేకాటవ్యసనం వున్నాడనే కోపంతో తనువచ్చేసిందని అనుకుంటోంది సుమిత్ర—అంతే. తనెవ్వరికీ అర్థంగాదు. అది తన దురదృష్టం. టీ తీసుకు రావటానికి వెళ్ళిపోయిన సుమిత్ర వేపు చూస్తూ అనుకుంది అరవింద.

మొత్తానికి ఖాళీగావున్న ఆ వుద్యోగం తనకిప్పించేటట్లు చేస్తానని సుమిత్ర చేత వాగ్దానం చేయించుకుని గాని అరవింద యివతలకు రాలేదు. ఇంటికొచ్చేసిం తర్వాత జరిగిందంతా రాధకు వుత్తరం రాస్తూ కూర్చుండిపోయింది. వుత్తరం ముగింపులో యీ సంబంధం - వదులుకున్నా - స్నేహితులుగా తమిద్దరూ యెప్పటికీ వుత్తరాలు రాసుకుంటూ వుండటం తనకిష్టమని వ్రాస్తోంది అరవింద. చిరునవ్వుతో చిలిపిగా వుండే రాధంటే అరవిందకి యిష్టం యేర్పడింది. వుత్తరం అంటిస్తుండగా "అరవిందా. యెక్కడున్నావే?" వంటయింట్లోంచి బామ్మకంఠం ఖంగారుగా విన్పించటంతో చేతులో కవర్ని టేబిల్ మీద పడేసి అరవింద ఆదుర్దాగా యివతలకు వచ్చింది. యేమయింది? అసలే అనారోగ్యం మనిషి - వద్దంటే విన్పించుకోకుండా అడ్డమైన చాకిరీ చేస్తుంటుంది.

'చూడు-చూడు-అతనొచ్చాడు. యిదేమిటి-క్యాంప్‌లో వున్నాడన్నావుగా-ఒక రెంకొకి ముందు ఆ గిన్నెలు తోమి యిలా బోర్లించు. చూడు సుబ్బులూ! వేడినీళ్ళ కాగుక్రింద నిప్పువెయ్యి. చూడమ్మా అరవిందా - నువు కొంచెం కాఫీచేసి అతనికివ్వు." అనుకోకుండా వచ్చిన శేఖరాన్ని చూసి ఆవిడ ఖంగారు పడ్తోంది. వచ్చినప్పటినుంచి అరవింద మాటలు వింటూనే వుండి మంచివాడేగాని కొంచెం కోపిష్టి గూడనయ్యె. అయినా మగవాళ్ళకి ఆ మాత్రం కోపంలేకపోతే అందం యేముంటుంది. ఆయన బ్రతికుండగా. "అదేమిటే కొయ్యబొమ్మలా అలా చూస్తూ నిలబడ్డావు-నా మొహాన కోతులాడటం లేదుగా-మీ నాన్న యింకో, అరగంటకి గాని రాడు. చూడు-మంచినీళ్ళు కావాలో యేమిటో."

గుమ్మాన్ని చేత్తో పట్టుకుని అలాగే నిలబడిపోయిన మనవరాలి వంక చూస్తూ మందలించింది బామ్మగారు.

శేఖరం వచ్చాడు! వచ్చాడా? అరవింద గుండె ఒక్క క్షణం ఆగిపోయి రెట్టింపు వేగంతో కొట్టుకోవటం మొదలుపెట్టింది. యెందుకొచ్చినట్లు క్యాంప్ యింకా వుందిగా - తనిక్కడను వచ్చేసినట్లు కంభువుత్తరం రాసాడా? లేకపోతే అన్నీ తనకిష్టంలేని పనులు చేస్తున్నానని నాన్నతో ఫిర్యాదు చేయటానికా? కానీ యేం జరుగుతుందో చూడాం. తనేనా జవాబు చెప్పలేంది. అరవింద లోపలికి వచ్చి కాఫీ కలపటంలో నిమగ్నురాలయింది. మడిగట్టుకున్న బామ్మగారికి మంచినీళ్ళు

> ఒక ఎడారిలో 99 ఉష్ట్రపక్షులు కలిసిమెలిసి జీవిస్తూ ఉండేవి. ఒకరోజున అవి ఇసుకలో తలలుదూర్చి కదలకుండా కూర్చున్నాయి. ఇంతలో ఎక్కడినించో ఇంకొక ఉష్ట్రపక్షి అటు వచ్చి "ఇక్కడ చాలా ఉష్ట్రపక్షులున్నాయనిచెప్పారే? ఒక్కటీ కనబడదేం?" అనుకుని వెళ్లిపోయింది.

తీసుకుని కుశలప్రశ్నలు వేయటానికి వెళ్ళింది.

యేదో అవుతుంది, యేదో జరుగుతుంది-దానికి తను ధైర్యంగా నిలబడాలి అని తన్ను తను సిద్ధపరుచుకుని ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఆ క్షణంకోసం చూస్తున్న అరవిందకి రాత్రి 10 గం|| దాటినా యేం జరగలేదు. నాన్న అంతకంటే-తను చెప్పినవన్నీ మర్చిపోయినట్లున్నాడు - పండక్కి వచ్చిన అల్లుడిలా మాట్లాడుతున్నారు. కావాలని క్యాంప్ క్యాన్సిల్ చేసుకున్నానని బొంబాయి పిన్నిని చూడటానికి అరవిందని గూడ తనతో తీసుకువెళ్లాలిగాబట్టి యిటు వచ్చానని చెబుతున్నాడు. అంతా నటన అనుకుంది తలుపు పక్కన నిలబడి వక్కలు కత్తిరిస్తున్న అరవింద.

వద్దంటున్నా వినకుండా లేనిపోని హడావుడిచేసి గదంతా అరగంటలో అలంకరించింది బామ్మ-తను విసుక్కుంటున్నా వినకుండా పెద్ద సన్నజాజిపూల దండ తెచ్చి తల్లో తురిమింది. అరవింద కెందుకో యేడుపొస్తున్నంత పనైంది. పోట్లాడటానికి సిద్ధంగా వెళ్తున్న వాళ్ళు యిలా అలంకరించుకోవటం యేం బాగుంటుంది-అయినా తప్పదు- బామ్మది మొండిపట్టు - తనతో చెప్పకుండా వచ్చేసినందుకు శేఖర్‌కి సంజాయిషీ చెప్పుకోవాలి. తను అది సిద్ధంచేసుకునే వుంచుకుంది. యింక భయం దేనికి - తన మాటలకి అతని మొహం యెఱ్ఱబడ్తుంది. తనని నొప్పించేమాటలు చదువుకున్నావని, నోర్మూయ్యమని యెన్నయినా అనవచ్చు. వాటికి గూడ తను జవాబు చెప్పగలదు అహంకారం యెవరికో తనివాళ నిరూపించబోతోంది. ఆక్షణం యెంతత్వరగా వస్తే అంత బాగుండు.

అరవింద యెదురుచూస్తున్న క్షణం రానే వచ్చింది. అంతా నిద్రపోయారు. రోజూ రాత్రి 11-00 గం॥ దాక గీత చదువుకునే బామ్మ యీరోజు అలసిపోయి కాబోలు త్వరగానే పడుకుంది. నాన్నగూడ నిద్రపోయినట్టేవుంది. కదలిక లేదు. మంచినీళ్ళు తీసుకొని అరవింద మెల్లిగా గదిలోకి అడుగుపెట్టింది. గదిలో శేఖరం కిటికీ రెక్కమీద చేయి ఆన్చి బైట వెన్నెల్లోకి చూస్తున్నాడు. తన అడుగుల చప్పుడు అతన్ని యీలోకంలోకి తీసుకురానందుకు అరవిందకు కోపంవచ్చింది. తనకేం భయంలేదు. తనే ముందు మాట్లాడుతుంది.

"క్యాంప్ యెందుకు కాన్సిల్ చేసుకున్నారు."

వులిక్కిపడ్డ శేఖరం వెనక్కుతిరిగి క్షణం సేపు అరవిందవైపు పరిశీలనగా చూశాడు. అదేమిటి? అతని కళ్లు నవ్వుతూవున్నాయి.

(36-వ పేజీ చూడండి)

# ప్రతిమ

## భాస నాటక కథ



అఖిల భువనభవనం ఆనందనిలయమై ఉంది. పటహాది వాద్యాలూ, మౌక్తికచ్ఛత్రచామరాలూ, సువర్ణకలశాలూ విధివిహితమైన ఒక మంగళ ఘడియకు సూచనలై అయోధ్య కోలాహలంగా ఉంది. రాచవీటిలో వందిమాగధుల కంఠాలు శ్రుతితప్పని ఘోషం చేస్తూండగా అప్పుడే పుష్యరథం రప్పింపబడింది.

నభోవీథినుండి నలువకొడుకు నారదుడు కూడా భగవత్సంకీర్తనం చేస్తూ దిగివచ్చాడు. ఆరంగూరిన ఊర్మితో అరమర లెరుగని ఒద్దికతో అయోధ్యావాసులంతా నయోధ్యగా ఈ మహోత్సవ దర్శనానంద కౌతుకంతో తామరతంపరై తరలి వచ్చారు.

రాజసభాభవనంలో ఈ సంరంభం ఇలా ఉండగా అంతఃపురంలో అంత కలకలం కనపడలేదు. అంతఃపురం తొణుకు లేని మహార్ణవ సదృశంగా ఉంది. జనాంతరంగ మహాసముద్రం ఉల్లోలంతో ఉప్పెనలో ఉదధిలాగా ఉబకలాడి దబకలాడి తబ్బిబ్బవుతున్నది.

ఈ అంతఃపురంలో నలుగురు చెలికత్తెలు. అంచయానలు. వారిమధ్య రాయంచవంటి రమణీమణి-ఆమె జనకరాజపుత్రి. వివాహవేళ విశ్వమోహినియైన సర్వమంగళవలె ఆమె ఆ శుభసముహూర్తానికి శోభిస్తున్నది.

ఇంతలో అవదాతిక ఒకత్తె చిలిపిగా పరుగున వచ్చి అక్కడ జానకిని చూసి వెలవెలబోయింది. దానిచేత ఒక నారచీర! దొంగిలించుకు వచ్చింది. నాటకరంగాలంకరణం చేసే రేవదాసిని అశోకపు చిగురుటాకులు నాలుగు పెట్టమంటే వల్లకాదన్నది. ఆమె పని పట్టాలని నారబట్ట చేబట్టి పారిపోయివచ్చింది అవదాతిక. వేత చెలికత్తెల నగింది. "చేటికలంటే ఏదో తప్పులు చేస్తూ ఉంటారు కదా—ఈ అవదాతిక కూడా అనుచితపని ఏదో చేసి ఉంటుంది" అని సఖులు సమాధానించారు.

ఈ గుసగుసలు విని అవదాతిక తానేమీ తప్పు చేయలేదని, నవ్వులాటకు నారచీర ఎత్తుకు వచ్చానని ఉన్నమాట చెప్పింది. ఆ నారచీర చూస్తే అవనీతనయా హృదయంలో ఓ వింతకాంక్ష మొలకెత్తింది. నారచీర తీసుకుని 'ఇది నేను ధరిస్తే ఎలా ఉంటుందే అవదాతికా' అని అడిగింది సీతమ్మ.

'అందమైన వాళ్ళకు అన్నీ అందంగానే ఉంటాయి కదా' అన్నది అవదాతిక.

ఆ మాటకు జానకి వదనవనం చిరునవ్వు కలికతో తళుక్కున మెరిసింది. ఉల్లంలో ఉబలాటం కలిగి రామప్రియ నారచీర ధరించింది. అదే సమయంలో ఏదో కొంత గగ్గోలు రాజసభాభవన ప్రాంగణంనుండి ఆమె అవధరించింది. క్షణమాత్రం వినిపించి కలకలం కొంత సమసిపోయింది. ఇప్పుడామె ఇష్టసఖులను మళ్ళీ ప్రశ్నించింది. నారచీర తన అందానికి అలంకారమైనదో, ఈ అలంకారమే తనకొక అందమైనదో ఆమెకు తెలుసుకోవాలనిపించింది.

'పులకాంకురాల తాలవా - పలుకులు వేయెందుకు - నారచీర అయినా బంగారు

చీరలా ఉంది. శయనాగారం కొత్త శోభతో వెలిగింది. అమ్మ అపరంజి తునకలా ఉన్నారు- అన్నారు చెలికత్తెలు. సీత చెవికి మాటలు చాలలేదు. తన అందానికి సాక్షీభూతంగా ఒక అద్దం తెమ్మనికోరింది. ఆమె అద్దంలో తనను చూసుకొని ఆనందించింది. ఈ సంబరంలో ఒక చేటి పరుగునవచ్చి 'శుభ వర్తమానం అమ్మగారూ' అని హెచ్చరించి నవ్వింది. ఆ నవ్వు ముత్యాలహారం కోరినట్లుంది. 'బాబుగారికి పట్టాభిషేకం కాబోతుందీ' అంది మళ్ళీ ఆ సఖి. సీత ముఖసీమ సిగ్గుపాటు నీడతో నీలిమపై క్షణం నిమగ్నమైంది. 'మహారాజులుంగారు కుశలంగా ఉన్నారా?' అని ఆత్రంగా సీత అడిగింది.

'అహో - ఇంతకీ ఈ పట్టం కట్టేది మహారాజులుంగారే' అన్నది చేటి.

“అయితే ఇది ఒక శుభవార్త కాదు. రెండు శుభవార్తలు- తీసుకో” అని జానకి పారితోషికాలతో చేటి పరితోషం తీర్చింది. పారితోషికంతో పరితోషం కూడా పట్టలేక పోయింది చేటి. ఈ ఆనందసమయంలో గుండె అణగారే నగారా మోత భీకరంగా వినిపించింది. జానకీ హృదయవారిజం ఒకింత భయపడి వణికింది. రాజాస్థానాలు - రాచకార్యాలతో కడు ఒడిదుడుకులతో ఉంటాయి, అదే ఏదో అయివుంటుంది ఆ నగారా మోత అనుకున్నారు సఖీజనం.

అప్పుడు జన్మతః మహారాజవైభవోద్దాముడైన శ్రీరామచంద్రమూర్తి అంతఃపురంలోకి ప్రవేశించినాడు.

వైదేహీ హృదయమంగళ సంజీవాన్ని గ్రహించినవాడై ఆయన ఇలా అన్నాడు,

“వైదేహీ ఏమిటే అలా వున్నావు”

ఆర్యపుత్రునికి అభివాదనంచేసిన ఆర్యామనోహారీ ముఖమండలంలో ఆర్యశ్రీ ఒకటే కురసింది. 'ఏమీ లేదు. ఈ పరిచారికలు అభిషేకమంటూ ఏమిటో అంటుంటేను...' అని అర్థోక్తిగా ఆమె అన్నది.

అప్పుడార్యపుత్రుడిట్లన్నాడు.

“అవును మైథిలీ! అభిషేక ప్రయత్నం జరిగినమాట నిజమే! గురు మంత్రి ప్రకృతి జన సమక్షంలో తండ్రిగారి నన్ను రాజ్యభారం పరిగ్రహించుమన్నారు. అప్పుడు నేను, ఏమి బదులు చెప్పి ఉంటాను చెప్పు మైథిలీ”- అని పృచ్ఛ చేసినాడు రాముడు.

మైథిలి మానస సరోవరంలో రెండు అలలు లేగినవి. వినమితశిరస్క అయి 'ఆర్యపుత్రులు మాట పెగలక నిట్టూర్పు విడిచి నీరై తండ్రిగారిపాదాలపై వ్రాలివుంటారనుకుంటాను” అన్నది మైథిలి. ఈ మాటలకు తామరసనయనుడూ నయనాభిరాముడూ అయిన శ్రీరాముని కనులలో ఆనందగంగ అవతరించినది. “సీతా - ఎంత చక్కగా ఊహించావు. సమశీలవైన నీవు నాకు లభించావు. ఇటువంటి దాంపత్యాలు



దేశకాల అనవచ్ఛిన్నంగా ప్రజలహృదయాలను చూరగొనేది రాముని రమణీయచరితం. దానిని తొలిసారిగా కావ్యంగా గానంచేసినవాడు వాల్మీకి. ఆ రామచరితనే భాసుడు వివిధ రూపకాలలోతీర్చి జనాన్ని మరింత రంజింపజేశాడు. అవాల్మీకీయమైన కట్టుకథలనుకూడా కల్పుకుంటూ "ప్రతిమ" రచనలో భాసుడుచూపిన శిల్పచాతుర్యం రేఖామాత్రంగా చూపడమే ఈ ప్రయత్నం.

# ★ ప్రతిమ ★

లోకంలో ప్రకృష్టంగా ఉంటాయి. మన మనోధర్మాలు రెండూ ఒకటే. నిజమే— నీవూహించినట్లే నేను అపనేచేశానుసుమా" అన్నాడు రాముడు.

"నాయనగారి ఆశంసను నేనంగీకరించక పోయినాను. ఆయన కలకాలం చల్లగా ఉండాలని నేను మనసారా కోరుకుంటున్నాను. ఆయన వానప్రస్థానికి పోవడం నాకు మనస్కరించలేదు. అదే అన్నాను. కాని ఆయన నా గుండెలు గుభిలుమనేటట్లు జరాకృశమైన తమ జీవితంమీద ఆన పెట్టారు. విధివిధానం అవితథమైంది కదా. నేను నిరుత్తరుడనయినాను. పట్టాభిషేక ప్రయత్నం సర్వరాజన్యుల సమక్షంలో రాజసభలో జరిగే వేళ—మహారాజులుంగారి చెవిలో మంథర ఏదో మనవిచేసింది. నేను రాజా కాలేదు. పట్టాభిషేకప్రయత్నం అపట్టున ఆగిపోయింది. నేనిలా వచ్చాను." అన్నాడు శ్రీరాముడు.

సీతాదేవికి అపరిమితమైన ఆనందం కలిగింది. ఆమె గుండెలో ఏదో బరువు తీసివేసినట్లయినది.

"ఇది నాకెంతో ఆనందంగా ఉంది. నాయనగారే మహారాజులు. ఇక ఆర్యపుత్రులు ఆర్యపుత్రులుగానే ఉంటారు – కాలం హాయిగా యథాతథంగా గడచిపోతే కావలసిందేమున్నది." అన్నది రామాభిరామ, సీత.

అప్పుడు రాముడు సీతాదేవివద్దకు ఒకింత జరిగినాడు. 'చూడు మైథిలీ – నగ కట్టు తీసివేశావు – ఎందుచేత' అని అడిగినాడు. అందుకు సీత, తాను అలంకారాలు పెట్టుకోనేలేదన్నది. కాని సీతాహృదయేశ్వరుడు ఆ మాటలు నమ్మలేదు. "కాదు, నీవు యిప్పుడే నగలు తీసివేసి ఉంటావు. లోలాకులు తొలగించడంవల్ల చూడు-కర్ణరంధ్రాలు కందివున్నాయి, కరకంకణాలు నీవిప్పుడే తీసివుంటావనడానికి చేతులనవున్న తెల్లటి అరవనులే సాక్షి. ఇక కంఠసీమ అంటావా నగల బరువుకు అంతా గుర్తులుపడి ఉన్నది. చూడు" అన్నాడు.

'మీ మాటలలో అసత్యాలు కూడా సత్యాలే అవుతున్నాయి' అన్నది రాముని జవరాలు.

'అది సరే ఇవేమిటివి. సూర్యకిరణ సదృశాలై శుద్ధంగా విద్ధంగా ఉన్నాయి. నారచీరలా 'ఏమిటి' అంటూ ఆర్యపుత్రుడు. ఆర్యా చేలాంచలం పట్టిచూపినాడు సంతోషానికి కట్టుకున్నావా లేక విధిగా వ్రతవిధికి తాల్చినవా ఈ నారచీరలన్నాడు— మైథిలి కలవరపాటున కళవళపడినది. ముచ్చటకు కట్టుకున్నారమ్మగారు అన్నది అవదాతిక.

స్మితపూర్వాభిభాషణభూషణుడైన రఘుకులభూషణుడు ఒక చిరునవ్వు నవ్వుకున్నాడు... 'మైథిలీ! ఈ నారచీర ఇక్ష్వాకులవరమదరలో విడరాని అలంకారం కదా. మరి యిప్పుడు ఎందుకు ధరించావు. నాకూ యిష్టమే – ఇలా ఏదీ యివ్వు" అని అందుకోబోయినాడు రాఘవుడు.

అప్రయత్నముగా 'అమంగళం ఆర్యపుత్రా' అన్నది రామ సహధర్మచారిణి 'ఈ నారచీరలు మీరు తాల్చరాదు. ఇప్పుడీ శుభసమయంలో వద్దు' అన్నది ఆమె. అందుకు మళ్ళీ రాముడు నవ్వుకొన్నాడు. 'అర్ధాంగిని నీవు ధరించి నాకు సగము ముందే కట్టబెట్టినావుకదా' అని చమత్కరించినాడు.

'ఏమో! అభిషేకము తప్పిన మీరు ఇలా అనడం నాకు భయంగా ఉన్నది' అన్నది జానకి.

అంతఃపురంలో సీతామందిరంలో ఈ సంభాషణ జరుగుతున్న సమయంలో కాంచుకీయుడు పరుగున వచ్చి 'మహారాజులుంగారు ఆపదలో ఉన్నారు' అని తెలిపినాడు. స్వజనము వల్లనే కీడుమూడినదని వాకొన్నాడు. కైకేయీదేవి మూడు వరాలు కోరుకున్నదనీ – అవి మూడు శరాలుగా మహారాజులుంగారికి తగిలినవనీ కాంచుకీయుడు విన్నవించినాడు,

'అమ్మగారివలన ఆపద రాజాలదు. ఇది యేదో మంచిని చేయగల మహాత్కార్యమే– శుభోత్తరమేనని ఆర్యపుత్రుడు నిశ్చయించుకొన్నాడు.

కాంచుకీయుని సందేహము గ్రహించిన ఆ రాఘవుడు మళ్ళీ ఇలా అన్నాడు.

"అవును సుమా. ఇంద్రునంతివాడు పతి కాగా – మావంటి కుమారులుండగా ఇంతటి రాజ్యప్రాభవమూ ఆమెదై ఉండగా అమ్మగారికి తక్కువేమిటి? ఆమె మాకు ఆపద తెచ్చిపెట్టనా?"

"మీ అభిషేకము ఆమెవల్ల నేకదా ఆగిపోయినది" అన్నాడు కాంచుకీయుడు.

"అంతకన్న కావలసినదేమున్నది? అరణ్యవాస క్లేశం నాయనగారికి, రాజ్యభారభయం నాకు నూతనాధిపత్య సంకటాలు ప్రజలకు, సింహాసన యోగం లేదనే బాధ తమ్ములకు ఒక్కసారిగా తప్పిపోలేదా? అమ్మగారు ఇందరికన్ని మేళ్ళు చేయలేదా?" అని ఒక్కుమ్మడి శ్రీరామచంద్రుడు ప్రశ్నించినాడు.

అప్పటికీ కాంచుకీయుడు నిరుత్తరుడు కాలేదు. "అది సరే భరతునికి పట్టాభిషేకము చేయవలసినదని వరమడిగినారు అమ్మగారు. ఇదీ సమర్థింతురా" అని తిరుగ ప్రశ్నించినాడు.

ఇందుపై రాముడించుక హసించినాడు. "పిచ్చివాడా – పూర్వమే దత్తమయిన వరం ప్రకారం అమ్మగారు భరతునికి రాజ్యం కావాలని కోరుకొని ఉంటారు. నాకే రాజ్యం సంక్రమిస్తే భరతునిరాజ్యం నేను హరించినట్లు కాదా? ఇందులో తప్పేమున్నది" అని అడిగినాడు.

మరల నేదో చెప్పబోయిన కాంచుకీయుని అర్ధోక్తిలోనే ఆ రఘువంశదీపకుడు ఆపినాడు. అమ్మపై అపవాదము వినవొల్లనన్నాడు. మహారాజులుంగారి విషయము కాంచుకీయుడు తెలుపసాగినాడు. "శోకావేశమున మునిగి మాటాడలేక చేతిసంజ్ఞ చేత నన్నిటకు పంపి తమను తోడుకొనిరమ్మని ఏలినవారు పంపినారు. ఆయన వాంఛితం మరి ఏమిటో మూర్ఛలో మునిగినారు" అన్నాడు కాంచుకీయుడు.

శ్రీరాముడీ మాటకు శంకితుడైనాడు. 'తండ్రిగారు మూర్ఛలో మునిగినారా' అని ఆతురుడై అడిగినాడు.

అంతట లక్ష్మణస్వామి ప్రభంజనమువలె దూసుకొనివచ్చినాడు. ఆయన చేతి సింగాణము, బాణములు కోప విశేషమునకు చిహ్నములై యున్నవి. అన్నా మూర్ఛలో మునిగినారా తండ్రిగారు అంటున్నావు కదా, అయితే తండ్రిగారి హృదయానికి శల్యమై బాధిస్తున్న చింతచల్లసాగ్నాలనే నీవు కోరుకుంటే ఇదుగో బాణం. ఆ వృద్ధ ప్రాణం

# రాశిఫలాలు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

**4-5-1960 బుధవారం మొదలు**

**10-5-1960 మంగళవారం వరకు.**

### మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారంలో ఆడంబరం పెరుగుతుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. మీ నిత్య వ్యాపార వ్యవహారాంగాలలో అనుకూలత ఉంటుంది. బంధువులు వస్తారు. మీమీద మీ స్నేహితులకు సందేహాలు తొలగిపోయి విశ్వాసపాత్రంగా ప్రవర్తించగలుగుతారు. అనుకూల ప్రయాణాలు సఫలంగా జరిగే అవకాశాలు తక్కువ. నీచులను నమ్మి చేసిన పనులు ఈ సమయంలో ఆందోళన కలిగిస్తవి. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. వారం రెండవభాగంలో ఇతరుల కార్యభారం మీద పడుతుంది. శుభవార్తలు తెలుస్తవి. ముందు తొందరపడి దుబారా ఖర్చులు చేయటంవల్ల ముఖ్యమైన పనులకు ఇబ్బందిపడతారు. 5, 6 లలో సుఖభోగం, సంఘంలో పేరుప్రతిష్ఠలు, ద్రవ్యలాభం.

*　　*　　*

### వృషభం:

(కృత్తిక 2, 3, 4, పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రతి చిన్నపనీ శ్రమతరంగా తోస్తుంది. మీ ఆరోగ్యంగురించి శ్రద్ధ వహించటం అవసరం. స్నేహితుల మాటలనునమ్మి కార్యరంగంలో ప్రవేశిస్తారు కాని మధ్యలో చిక్కుపడవలసివస్తుంది. మీ రహస్యాలను తెలుసుకుని అపకారం చేయటానికి ప్రయత్నించే మనుష్యులను గురించి జాగ్రత్తగా ఉండండి. వృత్తి ఉద్యోగాలలో మీ కష్టానికి తగిన ఫలితం పొందగలుగుతారు. తూర్పు, ఉత్తరదిక్కులనుంచి లాభవార్తలు తెలుస్తవి. అధికారులతో వివాదాలు రాకుండా చూచుకోండి. పిల్లల ఆరోగ్యం బాగుంటుంది. మిమ్ములను గురించి ఎవరు ఎన్నిరకాలుగా అనుకుంటున్నా ధైర్యం కోల్పోకుండా నిబ్బరంతో ఉండటం అవసరం 7, 8 లలో ధనలాభం, విలువగలవస్తువులు కొంటారు. శుభవార్తలు.

*　　*　　*

### మిధునం:

(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

మీ మంచితనమే మిమ్ములను కాపాడుతుంది. వ్యవహార రంగంలో విజయం సాధిస్తారు. మీకు అపకీర్తి కలిగించటంనిమిత్తం ప్రయత్నించినవారు తామే అవమానం పొందుతారు. ధనలాభం బాగుంటుంది. రాజకీయాలలో మీ మాట చెలామణి అవుతుంది. వృత్తి వ్యాపారవిషయాలలో అభివృద్ధికరమైన సమయం. శుభ ప్రయత్న కార్యాలు మొదట ఆటంకాలు వచ్చినా చివరకు సంతృప్తికరంగా జరుగుతవి. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి బంధుమిత్రులనుగురించి మీరు పడిన శ్రమ ఫలిస్తుంది. వారాంతంలో విలాస వినోదాలనిమిత్తం ఖర్చులు పెరుగుతవి ఆకస్మాత్తుగా కలహ ప్రసంగాలు వస్తవి. 4, 6 లలో నమ్మినవారివల్ల మోసం. శ్రమవల్ల కార్యసిద్ధి.

*　　*　　*

> **గ్రహస్థితి**
>
> మేషంలో సూర్య బుధ శుక్రులు సింహంలో రాహువు ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు, మీనంలో అంగారకుడు, కటక సింహ కన్య లలో చంద్రుడు.

### కర్కాటకం

(పునర్వసు 4 వ పా., పుష్యమి, ఆశ్లేష)

ప్రతిపనీ ధైర్యంతో సాధించగలుగుతారు. మీ బాధ్యతలను సక్రమంగా నిర్వహించి సంఘంలో మీ స్థానాన్ని కాపాడుకుంటారు. స్నేహితులు మీ సహాయం కోరివస్తారు. కుటుంబంలో అశాంతి సూచనలు కనుపించి క్రమంగా బలపడుతవి. మీరు ఆకస్మాత్తుగా చేసిన పొరపాట్లవల్ల కొద్ది నష్టాలను భరించవలసి వస్తుంది. విలువగల వస్తువులను కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. క్రొత్తవారితో స్నేహం లభిస్తుంది. కాని మీరు అనుకున్నట్లు ప్రయోజనం మాత్రం ఉండదు. గౌరవప్రదమైన సమయం. వృత్తిలో శుభప్రదమైనసమయం. వారాంతంలో మీ ఆరోగ్యం లోపిస్తుంది. లాభకరమైన వార్తలు తెలుస్తవి. 5, 6, 7 తేదులలో ఆందోళన, స్వల్ప ప్రతిబంధకాలు, ధనప్రాప్తి.

*　　*　　*

### సింహం:

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

గ్రహబలం బాగున్న సమయం. పదిమందిలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకుంటారు. అధికారం, దర్పము పెరుగుతవి. ఇంతకు ముందు ఉన్నటువంటి కలహాలు తొలగిపోయి మనశ్శాంతి లభిస్తుంది. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం సకాలంలో చేతికి వస్తుంది. వ్యవహార కార్యాలు మీ ఇష్టప్రకారం నెరవేరుతవి. మీ విరోధులు అపవాదులు ప్రచారం చేస్తారు. కాని అందువల్ల మీకు అపకారం జరుగదు. బంధువులకు, స్నేహితులకు సహాయం చేయటం నిమిత్తం ఖర్చులు భరించవలసి వస్తుంది. కుటుంబంలోనివారికి అనారోగ్యం చేస్తుంది. ఆకస్మాత్తుగా యంత్రాలు, ఆయుధాలు మొదలయినవాటివల్ల గాయం తగిలే అవకాశాలున్నవి. ఈ సమయంలో ఇతరుల పలుకులను పాటించటం మంచిదికాదు 9, 10 తేదులలో దుబారా ఖర్చులు, బంధుమిత్రులవల్ల శ్రమ.

*　　*　　*

### కన్య:

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1 2 పా)

ఈ సమయంలో ఎవరినో మాట పడబోయినా కలహాలు ఎదురుగా వస్తవి. ధన వ్యయం ఎక్కువ అవుతుంది. కాని తగినంత ప్రయోజనం పొందలేకపోతారు. ఎవరి సహాయంతోను ఏ పని నెరవేరుతుందని చెప్పుకోగదు. వృత్తిలో మార్పులు అభివృద్ధి కలిగేట్లు తోస్తుంది. కాని ఆలస్యం అవుతూ ఉంటుంది. కుటుంబం నిమిత్తం మీరు శ్రమపడతారు. కాని ఎదటివారివల్ల ఆదరాభిమానాలు లభించకపోవటంవల్ల విసుగుదల ఎక్కువ అవుతుంది. వారం రెండవ భాగంలో పుణ్యకార్యాలు జరుగుతవి. ముఖ్య బంధువుల వద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. స్త్రీలు, ఆభరణాలు మొదలయిన విలువగల వస్తువులు కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. ప్రయాణాలు చేస్తారు. శ్రమతరంగా ఉంటుంది. 7, 8 లలో ధనలాభం, సంఘకార్యాలు.

### తుల:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ప్రస్తుతం సాధ్యమైనంతవరకు ఇతరుల బాధ్యతలను తగ్గించుకుని ప్రశాంతంగావుండటానికి ప్రయత్నించటం అవసరం. తప్పనిసరిగా ఖర్చులు పెరిగే సమయం. మంచి మాట చెప్పినా యథార్థం మాట్లాడటంవల్ల విరోధాలు తెచ్చుకుంటారు. మీ ఆరోగ్యం గురించి శ్రద్ధవహించటం అవసరం. ప్రయాణాలు చేయవలసివస్తుందని అనుకుంటారు, కాని ఆటంకాలు వస్తవి. కొంతవరకు పేరుప్రతిష్ఠలు పెరుగుతవి. ఆదాయం మాత్రం

మీరు అనుకున్నంత వివేకంగా కనుపించదు. అనేక సందర్భాలలో మీ ఉద్రేకాన్ని తగ్గించుకుని నిబ్బరంతో వ్యవహరించటం అవసరం. స్త్రీలతో స్నేహం లభిస్తుంది. ఒకటిరెండు పనులలో మీకు ఇష్టం లేకుండా ప్రవేశించవలసి వస్తుంది. 5, 6 లలో ధననష్టం, వ్యవహారజయం, కీర్తి.

*   *   *

### వృశ్చికం:

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ).

ఈవారంలో మీరు ఏపని తలపెట్టినా శ్రమ అధికంగా ఉంటుంది. మీకు మీ మిత్రులకు మధ్య కలతలు తీసుకునిరాగల మనుష్యులు ఉంటారు. జాగ్రత్తగా ఉండటం మంచిది. కొన్ని సమయాలలో మీ ఆలోచనలు కార్యరూపం పొందకుండానే మార్చుకోవలసి వస్తుంది. ఆదాయం బాగుంటుంది. ముందు ఎప్పుడో లాభించగల పనులనిమిత్తం ప్రయత్నిస్తారు. శుభకార్య ప్రయత్నాలు నెరవేరుతవి. మీవల్ల పనిసాధించుకునే నిమిత్తం ఇతరులు చెప్పే ఆదుర్దా కలిగించే వార్తలను నమ్మవద్దు. తూర్పు, ఉత్తరదిక్కులలో ధనలాభం; కార్యసిద్ధి పొందగలుగుతారు. సాధ్యమైనంతవరకు కలహప్రసంగాలనుంచి తప్పుకోనండి. పిల్లల ఆరోగ్యం బాగుండదు. 5, 6 తేదులలో కష్టవార్తలు, నిర్ణయం లేని ఆలోచనలు, బంధుమిత్రుల వల్ల శ్రమ; ఖర్చు.

*   *   *

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా.1)

తీరికకూడా విశ్రాంతి లేకుండా కార్యక్రమం పెరుగుతూ ఉంటుంది. ఎప్పుడూ ఏదో ఒక విషయాన్ని గురించి యోచిస్తూ ఉంటారు. వృత్తి ఉద్యోగాలలో అనుకూలమైన సమయం. మీ హోదా పెరుగుతుంది. ఇంతకుముందు చేసిన శ్రమవల్ల ఆదాయము, సంఘంలో మంచి పేరు సంపాదించుకో గలుగుతారు. బంధువులతో విరోధాలు వస్తవి. కాని అందువల్ల కష్టనష్టాలు ఏమీ ఉండవు. ఇతరులకు సలహా చెప్పి గొప్పపనులు సాధించ గలుగుతారు. వృత్తి వ్యాపారాలలో పోటీ వారివల్ల సహాయము, లాభము లభిస్తవి. అన్ని విషయాలలోను ధైర్యము, దూరదృష్టి కలిగి ప్రవర్తించగలుగుతారు. మీ స్నేహితులలో కొందరికి ఇంతకుముందు నుంచి మీమీద ఉంటున్న సందేహాలు తొలగిపోతవి. 7, 8, 9 లలో అకస్మాత్తుగా దెబ్బతగలటం, ధనలాభం, విలువగల వస్తువులు కొనటం.

*   *   *

### మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా,
శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఈ వారం మీ స్వంత కార్యక్రమాలు శ్రమకరంగా ఉంటున్నా ఇతరుల ఆదరాభిమానాలవల్ల ధైర్యంతో ముందుకు పోగలుగుతారు. త్రిప్పట అధికంగా ఉంటుంది. ధనసంబంధమైన ఇబ్బందులు, కలహాభయాలు క్రమంగా తొలగిపోతవి. ధనాదాయం మామూలుగా ఉంటుంది. ఇతరులకు చెప్పిన మాటను చెల్లించుకుంటారు. ఎదటివారి అభిప్రాయాన్ని పూర్తిగా తెలుసుకోకుండా మీరు తొందరపడటంవల్ల చేతికి అందిన అవకాశాన్ని పోగొట్టుకుంటారు. పిల్లల మూలంగా సుఖసౌఖ్యాలు లభిస్తవి. కుటుంబంలో ప్రశాంతంగా ఉంటుంది. వ్యవహార విషయాలలో మీ ఆలోచనలు అనుకూలిస్తవి. ముందు గుబారా ఖర్చులు చేయటం వల్ల వారాంతంలో శ్రమపడతారు. 4, 7 తేదులలో కారణంలేని ఆందోళన, మంచి వారితో స్నేహం. వృత్తిలో శ్రమ.

*   *   *

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,
పూ. భాద్ర 1, 2, 3 పా)

ఏ పనీ మీరు అనుకున్నంత సులభంగా నెరవేర్చలేక పోతారు. మీ చుట్టూ ఉండే వారినందరినీ ఒకదారిలో నడిపించటంకోసం శ్రమపడవలసి వస్తుంది. ఇంతకుముందు ప్రయత్నించి మానుకున్న పనులు తిరిగి ఈ సమయంలో ఆరంభిస్తారు. సంతోషవార్తలు వింటారు. ఇతరులతో కలసి చేయు పనులు మధ్య మధ్య చిక్కుపడుతూ ముందుకు సాగుతూ ఉంటవి. ఉపయోగం లేదని తెలిసికూడా తప్పుకోనటానికి సాధ్యం కాని కార్యభారం పైన పడుతుంది. ఆహార విహారాలలో జాగ్రత్తగా ఉండి ఆరోగ్యాన్ని కాపాడుకోనండి. వ్యవహార పరిష్కారాలకు అనుకూలమైన సమయం కాదు. కుటుంబంలో అభిప్రాయభేదాలు వచ్చి మీ మనశ్శాంతికి భంగం కలుగుతుంది. 4, 5 తేదులలో క్రొత్తపనులలో ప్రవేశం. బంధువర్గంలో మంచిపేరు, ధనలాభం.

*   *   *

### మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

అన్ని విధాలా అభివృద్ధికరమైన సమయం. దైవానుగ్రహంవల్ల మీ ధైర్యము, పట్టుదలా బాగా ఉపయోగిస్తవి. సాహస కార్యాలలో దిగవలసి వస్తుంది. ధనవిషయంలో సంతృప్తికరంగా ఉంటుంది. కోర్టు కచేరీలలో శ్రమ, ధనవ్యయం ఉన్నా గౌరవం నిలుపుకో గలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో పైవారి ఆదరాభిమానాలు సంపూర్ణంగా లభిస్తవి. పడమర దిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి. ఇంతకుముందు ఇతరులతో ఉంటున్న పేచీలు నివర్తి అయి రావలసిన ధనం చేతికివస్తుంది. కుటుంబంలో ఖర్చులు పెరుగుతవి. అయితే అసంతృప్తి కనుపించదు. క్రొత్త మనుష్యులతో అతిచనువుగా ప్రవర్తించటంవల్ల కార్యభారం పైన వేసుకుని బాధపడవలసి వస్తుంది. 9, 10 తేదులలో త్రిప్పట, పనులలో ఆలస్యం. నీచులతో కలహప్రసంగాలు. ★






# ఉబుసుపోక - కాలక్షేపం

'సీత'

సాధారణంగా యిద్దరు ఆడవాళ్ళు కలుసుకుంటే ఏదో "మీరు బాగున్నారా అంటె మీరు బాగున్నారా" అని కుశల ప్రశ్నలు వేసుకుంటారు తరవాత ఏం వండుకున్నారు అనో లేక ఫలానాచోట బట్టలు చవుకగా దొరుకుతున్నాయనో మాట్లాడుకుంటారు. అంతే. తరవాత ఏం మాట్లాడాలో తెలియక ఒకరి మొఖం ఒకరు చూస్తూ కూర్చుంటారు. కాసేపు ఆగి మధ్య మధ్యలో ఒక్కొక్క ప్రశ్న ఎవళ్ళని గురించో అడుగుతూ వుంటారు. అలాంటి సమయంలో ఇద్దరికీ కొంచెం చికాకుగానే వుంటుంది అలా మాట్లాడుకోకుండా కూర్చోవటం. మగవాళ్ళు కలుసుకున్నారనుకోండి. ఇంక రాజకీయాలు మొదలు పెడతారు. ఆ రాజకీయాలకి ఇంక అంతేవుండదు. ఒక్కొక్కప్పుడు అభిప్రాయభేదాలు వస్తే దెబ్బలాటలలోకికూడా దిగుతారు. అభిప్రాయాలు కలిస్తే యింక చెప్పనక్కరలేదు ఖులే సరదాగా మాట్లాడుకుంటారు. కొంతమందికి, రాజకీయాలు అవసరం లేనివాళ్ళకి వాళ్ళనిగురించి, వీళ్ళనిగురించి మాట్లాడు కోవటం అలవాటు. అలాంటప్పుడు కూడా కాసేపయాక మాటలు దొరక్క ఒకరినొకరు చూస్తూకూచోడం కద్దు. అయితే, ఆడవాళ్ళు రాజకీయాలు ఎందుకు మాట్లాడరు అని అడగవచ్చు. దీనికి అనేక కారణాలు వున్నాయి. ముఖ్యంగా యింట్లో పేపరు వుండకపోవడంవల్లనైతేనేం, చాలామంది చదువుకోని వాళ్ళుండటం వల్లనైతేనేం, లేక రాజకీయాలకన్నా ముఖ్యమైన యింటి పనులలో మునిగివుండటం వల్లనైతేనేం, వాళ్ళు సాధారణంగా రాజకీయాలు మాట్లాడరు. ఏదో సరదాకిమాత్రం "నెహ్రూగారు మనవూరు వస్తారట, రష్యావాళ్ళు 'వుపగ్రహం' ఆకాశంలోకి పంపించారట" మొదలయినవి చెప్పుకుంటారు. కొంతమందికి నగుసలు పెట్టుకొని హాస్యం చేసుకోవటం అలవాటు. మా అమ్మాయి మంచిదంటే, మా కోడలు అత్తగారు చెప్పినమాట వినదంటే, అత్తగారంటే, నిజంగా అతిరిక్తమే చేస్తున్నారంటే మొదలైన సమస్యలతో కొంతసేపు గడుపుతారు కాని అసలయిన కాసేపు తరవాత ఏం మాట్లాడటం? ఇది నిజంగా సమస్యే కాని ఆ సమస్యని పరిష్కారం చెయ్యవచ్చు. దీన్ని మాట్లాడటంలోని చాకచక్యం అనవచ్చు. ఎప్పుడైతే మనకు మాటలు దొరకలేదని తెలుస్తుందో అప్పుడు మనం ఎత్తుకున్న వాక్యాలనే పొడిగించి, వర్ణించి చెపుతూవుంటే కాలం గడుస్తుంది. అవతలి వాళ్ళూ సంతోషిస్తారు!

ఉదాహరణకు:—మీ యింట్లో ఏం కూర వండారు అని ప్రారంభించేరనుకోండి. ఏం కూర వండేరో చెప్పేస్తే మాటలయిపోతాయి. అప్పుడే మనం అందుకోవాలి. ఆకూర ఎంతకు కొన్నారు? ఎక్కడ కొన్నారు? అక్కడకన్నా ఇంకోచోట చవుకగా లేక ప్రియంగా దొరుకుతాయా? ఆకూర యింకో విధంగా తయారుచేయటం మీకొచ్చా? లేదా మనకు తెలిస్తే— నేను ఫలాని అప్పుడు ఆకూరను ఈ విధంగా చేశానని దాని వివరాలు ఒక్కొక్కటి చెప్పితే కొంచెం టైము కలుస్తుంది. మీ యింట్లో ఆకూర అందరికీ ఇష్టమా? ఎవరికి ఎలా వండితే ఆకూర యిష్టం? ఈ విధంగా ఒక్క కూరతో ఎన్ని ప్రశ్నలు, ఎన్ని సమాధానాలు వస్తాయో చూశారా? ఇలాగే ప్రతి విషయంలోనూ యిష్టంగా, ఓపిగ్గా యింకొకళ్ళతో మాట్లాడటానికి ప్రయత్నించాలి.

ఒక్కొక్కప్పుడు కథ కూడా చెప్పుకోవచ్చు సినిమా గురించి ఒక్క ముక్క ఎత్తితే చాలు—ఈ రోజుల్లో మాటలు వాటంతట అవే వస్తాయి. ఆ నటుడు ఫలాని సన్నివేశంలో అతను చేసిన నటనకంటె యింకో విధంగా చేసినట్లయితే బాగుండును. లేక ఆ డైరెక్టరు ఆ కథానాయిక చేత నటింపచేయటం చాతకాకనో వాడు ఫలాని సన్నివేశం నచ్చిందనో మొదలు పెట్టాలి. ఆ సన్నివేశం ఎందుకు నచ్చిందో, ఎలా నచ్చిందో, ఏవి ఏవి ఎక్కడ పెట్టాడో, యింకా యింకా ఏమేమి పెట్టివుంటే బాగుండేదో, పెట్టినవాటిల్లో ఏవి బాగున్నాయో, ఏవి బాగులేవో మొదలయిన వివరాలన్నీ మాట్లాడటం మొదలు పెడితే గంటలు, రోజులు దొర్లిపోతాయి! ★

## సరదాసలహా!

ఇది పెళ్ళిళ్ళ కాలం. మామిడిపళ్ళ కాలం. ప్రయాణాల తిర్ల కాలం. కార్యకరాముతుల 'తిక్క' కాలంకూడా! మనవైపు ఈ కాలంలో కలకలం చాలా ఎక్కువగా ఉంటుంది.

వేసవిలో ఈరోజుల్లోనే పెళ్లిళ్లు ఎక్కువ. మన ఇళ్లు దాదాపు పెళ్లిళ్లుగానే వుంటాయి.

పూర్వం అయిదురోజుల పెళ్లిళ్లూ, మూడురోజుల పెళ్లిళ్లూ ఉండేవి ఇప్పుడూ ఉండేచోట ఉంటున్నాయి సరదాకి, సంబరానికీ అంతేమిటి? హంగేమిటి? పదహారురోజుల పండుగదాకా సాగవచ్చు!

కానీ వేసవిలో ఈ హడావిడీ, ఆర్భాటం, తగ్గించాలి. మన పక్క 'వేడి'కీ, ఈ 'వేడుకల'కీ ఉన్న సాంగత్యం చల్లగా ఉంటే మంచిది ముక్తసరిగా జరగాలి వేడుకలు

# మనసున మల్లెలు

మల్లెలా వెన్నెలా. మంచితనానికీ, స్వచ్ఛతకీ చిహ్నాలుగా భావిస్తాం...

కొందరు మాటల్లో మల్లెలు వెదజల్లుతారు. కొందరు నవ్వుల్లో వెన్నెల చిలికిస్తారు... వాళ్ళని చూసి "అదృష్టవంతులు సుమా! వీళ్ళు" అనుకుంటాం. బాహ్య సౌందర్యాన్ని మాత్రమే చూసి తృప్తిపడగల నేత్రాలకి; మల్లెపొదల్లోనే మల్లెపూలు కనిపిస్తాయి. మగని సిగలోనే మల్లెలు కనిపిస్తాయి... కానీ, మల్లెలు, అవిమాత్రమే కావు...

అందమైన మనస్సు విరబూసిన మల్లెపొదలాంటిది. ఈ సంగతి ఎంతమంది గుర్తించగలరు? మల్లెపువ్వులాంటి మనసనగానే తక్షణమే జ్ఞాపకం వస్తుంది మా మాలిని..

మాలిని అందమైన అమ్మాయి. ఆ అమ్మాయి మాటల్లో తేనెలు వాగులై ప్రవహిస్తాయి. ఆ అమ్మాయి నవ్వుల్లో వెన్నెలలు వానలై వర్షిస్తాయి...

మధ్యతరగతి జీవితంలో మునుగుతూ, తేలుతూ.. ఎన్నెన్నో జీవితసమస్యల బాధపడుతూ. లేనూ. కూడా మాలిని ఎప్పుడూ నవ్వుతూ వుంటుంది. ఆ అమ్మాయి జీవితంలో, బియ్యం కొనడానికి డబ్బు అప్పుదొరకని ఇరవై అయిదో తారీఖులూ; వెంకటగిరి జరీ చీరమీద కోరిక అలానే మిగిల్చి తిరుగుదారిన తాము కళ్ళిపోయిన "బోనసు" ఇచ్చిన నెలలూ; పిల్లవాడికి పాలడబ్బా కొనలేక పోయి "ఈ ఒక్కపూటకీ మామూలు గేదెపాలు పోసి ఎంకి" అనుకొనే అనువన రోజులూ; లేవనీ కాదు...

అన్నీవున్నాయి... అయినా మాలిని ముఖంమీద దీనత నేనెప్పుడూ చూడలేదు. ఆ పెదవులు చిరునవ్వులని విడిచి పెట్టవు...

ఆ చిరునవ్వుల వెలుగుల్లో ఆమె మెడలో లేని రత్నాలహారాలు మనకి కనిపిస్తాయి...

మాలిని సిగలో మల్లెలు లేవు... కానీ ఆమె మనస్సునిండా మల్లెలే...

జీవితం వెలుగునీడల కలయిక అనీ, జీవితం రంగురంగుల ఇంద్రధనుస్సువంటిదనీ మనందరికీ తెల్సును...

పి. సత్యవతీదేవి

కష్టాలూ, సుఖాలూ, మంచీ చెడూ,— అన్నీ ఒకదాని వెంట ఒకటి తరుముకుని వచ్చి మనని ఉక్కిరి బిక్కిరి చేసి కాలగర్భంలో లీనమైపోతాయి...

చివరికి మనకి మిగిలేదేమిటి? ఈ ప్రశ్న చాలా బరువైంది...

"వివిధ రకాల అనుభూతులతో నిండిన మన జీవితం సుఖప్రదమే సుమా!" అనే తృప్తి చివరికి మిగిల్చుకోడానికి మనమేం చెయ్యాలి? మన మనస్సులో అందమైన మల్లెచెట్టుని పెంచి, నీరుపోసి వృద్ధిచేసి పుష్పింపజేయాలి. ఆ మేలుజాతి మల్లెలు దశదిశలా పరిమళం వెదజల్లాలి......

అసూయా, ద్వేషం పెరిగిన మనస్సు ముళ్ళపొద లాంటిదైతే, జాలి, సహనం, సంతృప్తీ, ప్రేమా పెరిగినమనస్సు మల్లెపొదలాంటిది.

జాలీ, సహనం మొదలైనవన్నీ స్త్రీకి సహజంగా వచ్చే సుగుణాలని చెబుతారు గానీ, ఇవి స్త్రీకే కాదు పురుషుడికి కూడా అవసరం. అలవాటే ఉత్తమ సంస్కార చిహ్నాలు. వారు వారు పెరిగిన పరిసరాలను బట్టి వృద్ధిచెందే సుగుణాలు.

మనస్సు చంచలమైనదంటారు. అవును.. అది గాలిలో ఊగే చిగురుటాకు వంటిదనీ, గాలి ఎటువీస్తే అటు కదులుతుందనీ అంటారు... నిజమే మరి! కానీ, ఆ మనస్సుకే శిక్షణ ఇచ్చినపక్షంలో బుద్ధిమంతురాలిలా మసలుకుంటుంది. కాదంటారా?

శరీరం సరిగ్గా పనిచేసి, ఆరోగ్యంగా వుండాలంటే, దానికి శిక్షణ ఇవ్వాలి. సక్రమమైన ఆహారం ఇవ్వాలి. ఆరోగ్యమైన శరీరం అందంగా వుంటుంది. అలానే మనస్సు కూడా సరియైన పద్ధతిలో వుండాలంటే దానికి శిక్షణ కావాలి. దానికి ఆహారం కావాలి. విశ్రాంతి కావాలి.

ఒకమనస్సు, అనుక్షణమూ ఏదో ఒక బాధతో రగులుతూ వుండటానికి కారణం, ఆ మనస్సుకి శిక్షణ లేకపోవటమే. మనస్సుని అదుపులో పెట్టగలగటం పెద్ద కష్టమైనపనే...అదెలా సాధ్యం అంటారా?

కన్నెపిల్ల దగ్గర్నుంచీ, కాటికి కాళ్ళుచాచిన అమ్మమ్మవరకూ కలలు కనటానికి వెనుదీయరు....

ఏ మాత్రం విశ్రాంతి దొరికినా, మనస్సు అనబడే ఈ గుర్రానికి కళ్ళెం వదులుతారు. అది పరిగెత్తి పరిగెత్తి అలసిపోతుంది. వీళ్ళూ అలసిపోతారు. చికాకు బయలుదేరుతుంది.

జానకి పద్దెనిమిదేళ్ళ అమ్మాయి. కాలేజీలో పి. యు. సి. చదువుతోంది. క్లాసులో పాఠాలు శ్రద్ధగా వింటుంది.

ఎప్పుడూ ఇంతే—30

శంకర్



# ★ మనసున మల్లెలు ★

ప్రతికలూ అవీ చదువుతుంది. రాత్రిపూట టేబిల్ లైటు వెలుగులో ఏ ఫిజిక్సో, కెమిస్ట్రీవో తెరిచి అలా కూర్చుంటుంది ...

ప్రక్క గదిలోనుంచి అమ్మ, నాన్నా మాట్లాడుకుంటూ వుంటారు...ఏమనీ?

"మొన్న చూసిన సంబంధం బాగానే వుంది...అబ్బాయి కేదో పెద్ద ఉద్యోగమన్నారు. మూడువందలు జీతమన్నారు... అబ్బాయీ బాగా వేతన్నాడు...ఆ మూడు ముఖ్యాపడితే..." అంటుంది అమ్మ...

నాన్న ఏదో చెప్పబోతూ వుంటాడు. జానకి అంతకిమించి ఇంక వినదు. ఆ పైన ఇక చదవదు:...

ఆ అమ్మాయి పఠిస్తున్న "బాయిల్స్ లా" అక్కడితో ఆ పేజీలలోనుంచి తప్పుకుని, ఒక కలల చిత్రం ఆమె కళ్ళముందు మెరుస్తుంది....

వివాహం, తియ్యని అనుభవాలూ. మనసులు కలుపుకుని హాయిగా ఏ స్వర్గానికో తేలిపోవటం. ఇలా ఇలా మనస్సు పరిగెడుతుంది. ఒక అందమైన కావ్యం జానకి కళ్ళ ముందు కదులుతుంది. జానకి ఇంక పాఠం చదవదు .. ఆ సంబంధం కుదిరిందా? జానకి కలలు నిజమయ్యాయా? అదంతా వెండి తెరకి కథేక్షకుడు... నేను చెబుతాను వినండి...

"ఆ అబ్బాయి కనీసం అయిదు వేలు కట్నం కావాలంటాడు. జానకి నాన్న రెండో కూతురికి పెళ్ళి చెయ్యాలి. పెద్దబ్బాయికి చదువు చెప్పించాలి...ఇంకా ఎన్నెన్నో చెయ్యాలి. జానకి నాన్న దగ్గర అయిదు వేలు లేవు... మరికొంచెం చవగ్గా దొరికే సంబంధం నాన్న చూస్తాడు. జానక్కి పెళ్ళవుతుంది. కాని ఆ అబ్బాయికి నెలకు మూడొందలు రావు... ఆ అబ్బాయి అంత అందగాడు కాడు... అతనికి తల్లీ, తండ్రీ తమ్ముళ్ళూ వున్నారు. జానకి అత్తవారింటికి వెళుతుంది. ఏదో అసంతృప్తి... పెద్ద పెద్ద కలలు కని కనీ అలసిపోయిన జానకికి ఈ జీవితం నచ్చలేదు. ఏదో చికాకు. మనస్సు ఎప్పుడూ ఏదో లోటుని సూచిస్తుంది. తనకి అమ్మ నాన్నా అన్యాయం చేశారనుకుంటుంది. ఇలా ఇలా ఇంకా ఎన్నో అనుకుంటుంది ఆమెకి సుఖం లేదు... ఆమె మూలంగా భర్తకి సుఖం లేదు...అంతా చీకటి...ఎక్కడ చూసినా ముళ్ళు...

దీనికంతకీ మూలకారణం జానకి అజ్ఞానం అంటారు. అవునా? పగటి కలలు కనటం ఒక పెద్ద జబ్బు. ఈ జబ్బుకి అలవాటుపడిన మనుష్యులు సోమరిపోతులైపోతారు...వీళ్ళ కలలకి హద్దులుండవు...ఇటుకలు, సున్నమూ, సిమెంటూ గట్టిగా వుండవు... అయినా పెద్ద రంగు రంగుల భవనం నిర్మించి వేస్తారు. అది ఒకనాడు నిలువునా కూలిపోతుంటుంది. బాధ, కసి....అంతా చీకటి ...అటువంటి మనసులకి శిక్షణ కావాలి. ఆలోచనాశక్తీ, వివేకమూ కావాలి...

జానకీ వివేకవతి అయిన పక్షంలో, తన తండ్రి ఆర్థిక స్తోమతుపై తన భవిష్యత్తు ఆధారపడి వుంటుందని తెలుసుకుని అంతంత కలలు కనకుండా మనస్సుని అదుపులో వుంచి దొరికిన దానితో సంతృప్తిపడి జీవితం సుఖవంతం చేసుకుని వుండును. మేడలు కూలిపోతేపోనీ...ఆ మేడలు కూలినచోట రెండు స్తంభాలపైన చిన్న పాక వేసుకుని దాని చుట్టూ పూలతోట పెంచుకుని నిర్మలంగా నిరాడంబరంగా గడపగలవారెందరు? ఆ కుటీరంలో ఎంత సౌందర్యం దాగివుంది!

ఇంక జానకి సంగతి వదిలివేయండి మరో మీనాక్షి సంగతి చెబుతాను...

మీనాక్షికి పాతికేళ్ళు...మధ్య తరగతి గృహిణి...మధ్యాహ్నం పన్నెండుగంటలకి పని పాటా ముగించుకుని మంచంమీద నడుం వాలుస్తుంది...

ఈమె పడుకోవటంతోటే, అంతవరకూ నిద్రపోతున్న మనస్సు లేచి కూచుని పని ప్రారంభిస్తుంది...

పక్కింటి పార్వతి పండక్కి కాశ్మీర్ సిల్కు చీర కొనుక్కుంది. నిన్నలా, దాని భర్తా కలిసి, సిమ్లా డార్జిలింగ్ మొదలైన వూళ్ళన్నీ చూసేందుకు వెళ్ళారు...సుందరి మొన్ననే యాభైరూపాయలు పెట్టి స్టీలు సామానులు కొన్నది...

వెధవది ఏమీలేనిది మీనాక్షి కొంపలోనే...ఎంతెంత జీతమూ చాలటంలేదు.. దీపావళికి చీర కొననేలేదు. సంక్రాంతికి పిల్లదానికి పట్టు పరికిణీ కుట్టిస్తానని చెప్పి అలానే మోసం చేశారు...ఇంటినిండా అన్నీ ఇత్తడిసామాన్లే... అందరి ఇళ్ళలోనూ వెండివాటికి మల్లే మెరిసిపోతూ స్టీలుగిన్నెలుంటే... అందరూ వచ్చి ఆవూరూ ఈవూరూ చూసేందుకు వెళతారు. ఈ మీనాక్షి ముఖానికి యేమీలేదు...ఈ పండక్కి కంచిచీర కొనకపోతే వూరుకునేది లేదు...

మీనాక్షి మనస్సు ఇలా ఇలా పరిగెత్తి అలసి అలసి కుప్పలా కూలబడుతుంది. అసంతృప్తి. నీరసం. ఆఫీసునుంచి భర్తవస్తా. మీనాక్షి మంచినీళ్ళు ఇస్తుంది...ముఖంలో కారాలూ, మిరియాలూ నూరుతుంది. పలకరిస్తే సాధింపులూ, దెప్పి పొడుపులూ. భర్త ఆ పంజరంలోనుంచి స్నేహితుల గుంపులోని వెచ్చదనంకోసం అలానే వెళ్ళిపోతాడు. మీనాక్షికి ఇంకొంచెం కోపం...



# హరివంశము

హారీత శివశర్మ

## అభిషేకపర్వం-1

ఐహికాముష్మికం శర్మ
పుణ్యం పుత్రాది సిద్ధిదం
మహాపాపాదిశమనం
పురాణం హరివంశకం ॥

నమః కృష్ణాయ కృష్ణాయ
సర్వావాస నమోనమః
నమో భూయో నమస్తేఽస్తు
పాహిలోకాన్ జనార్దన ॥

బుద్ధిప్రియాయ బుద్ధాయ
ప్రబుద్ధాయ సుఖాయచ
హరయే విష్ణవే తుభ్యం
నమః సర్వాత్మనే గురో ॥

—హరివంశము

వచ్చిన శరత్తు మహాయోగి మనస్సును బోలి సర్వ మలాలను రహితం చేసుకొని, సితమూర్తియై, శుభ్రరూపాన్ని ధరించి శుద్ధసత్త్వం లాగా విజృంభించింది. చిన్న చిన్న నదీనదాలలో క్షుద్రమత్స్యాలు చేరి తాపాన్ని పోగొట్టుకుంటున్నాయి అది గృహస్థుడైనవాడు పుత్రులని క్షేత్రాలని పెట్టుకొని మమత్వాన్ని వదులుకోలేనట్లు వుంది. వనాలలో మయూరాలు మదాన్ని పరిత్యజించి, మునివృత్తిని అవలంబించి, సంసారంలోని అసారతను ఎరిగిన యోగుల పోల్కిని సంచరిస్తున్నాయి. జ్ఞానియైనవాడు సర్వభూత జాతంతో తన విగ్రహాన్ని వదిలి విమలుడైనట్లు నదులలో జలాలు కలక తేరి తెలనై ప్రకాశించాయి. సరస్సుల శరత్ సూర్యసంతాపాలే బహు జంజాటాలలో పడి క్రుంగిపోయిన దేహధారులవలెనంగా, బహ్వశనంబ ము బట్టి త్వంచేత క్రాగిపోయిన జీవియొక్క హృదయంలాగా, శోషిల్లి పోయినాయి. అవబోధము కల్గి తత్త్వమయమైన జ్ఞానాన్ని సముపార్జించుకున్న జీవుడు ఎవిధంగా వీతరాగమైన మనస్సు కలవాడై, అమానుష్కుడై, అవభాసిస్తాడో, ఆవిధంగా సరస్సులలోని కల్వపువులు, స్వచ్ఛమై. తెల నివై, ఉల్లసిల్లాయి. యోగాభ్యాసి గౌమైన నిర్మల దళిత సంచార్కుంచేత వినామములై ప్రకాశించాయి. శరత్కాలం గతపూర్వం బృందావనంలో ఎక్కడా హంసలు కనిపించలేదు ఇప్పుడు అవి శ్రీకృష్ణుని కీరులను బోలి, నీల నవ్వులను బోలి, గోపికాజనం మందగమనాలను బోలి సరస్సులలో. యమునానదిలో సంచారాలు చేశాయి. యోగుల పోల్కిని సంచరించాయి. హావంలో అంతరాయం కల్గగా నిర్వేదాన్ని చెందిన యోగి తిరిగి సాధనావేశం తొందరయపడుతున్నట్లుగా ప్రవర్తించాయి సంప్రజ్ఞాతసమాధిని పొందినట్లు నదులలో జలాలు నిర్వికారస్థిమితాలై, నిశ్చలాస్తురీ గుచ్ఛులను మూర్తదర్శకాలైనాయి భగవంతుడై బలిమఖువుదగ్గ గతుడై వున్నాడని తెలుసుకొని సుమేధసులు ఎవిధంగా ప్రసన్న మనస్కులౌతారో, ఆవిధంగా యమునలో జలాలు ప్రసన్నతను భజించాయి. శరత్తు వచ్చి నల్లని మేఘాలను జయించి, ఆకాశాన్ని నిర్మలం కావించింది. ఆ ఆకాశం అప్పుడు యోగాగ్ని చేత సర్వ క్లేశాలను దహించివేసిన యోగియొక్క మనస్సులాగా ప్రకాశించింది. సూర్యకిరణములు కలిగి తేజస్సు చంద్రుని గలిగిన శరీరంవసెము, సహంకారజనకమైన దుఃఖం నివారించేటట్లు నశిస్తున్నట్లుగా వుంది. వర్షాకాలంలో ధూమములు సంకోపాలతోయ్యి ప్రసన్నల్లాయి. ఆకాశం మేఘాశిఖమై క్షీణమైపోయింది ఇప్పుడు శరత్తురాగా ప్రత్యాహారంచేత ఇంద్రియాలు ఇంద్రియార్థాలనుండి వియోజనం చెందినట్లు ధూములకు ఆ కాలుష్యం దూరమైపోయింది. ఆకాశం అక్లిష్ట శిష్టమై నిశ్చలమై ఒప్పింది. సరస్సులో జలం ప్రాణాయామం పట్టినట్లు మౌనగు కుంభీకృతమై, తర్వాత కాలువలద్వార కేదారములలోనికి రేచింపబడి అక్కడ చేలను పూరించి పంటలకు సాగించింది. భావలీన ఉత్సాహంతో సర్వగిరిసానువులు, నవస్థానాలనంపే గల్లగవ్యాములు, స్వాములు, బృందావనంలో గిరియజ్ఞ దర్శనోత్సుకులై వస్తున్నారు. ఆ కృష్ణుడు ఎవరో ఇంద్రుని మఖాన్ని కాదని ఈ యజ్ఞం చేయిస్తున్నారు! ఆ కృష్ణుడు నందయ్యగారి పుత్రుడు! అతను ఎట్లా వుంటాడో చూద్దామని గిరిదగ్గర పోతూ నందుని యింటివద్దకు వస్తూవున్నా వాళ్ళు. అక్కడ కృష్ణుడు కన్పించడంలేదు ఉత్సవం సందడిలో రామకృష్ణులు ఒకచోట వున్నవాళ్ళు ఇంకోచోట వుండటంలేదు. ఎక్కడబడితే అక్కడ తామే అయి కన్పిస్తున్నారు. ఏమిటేమి సంభారాలతో గిరియజ్ఞం సాగించబోతున్నారో చెబుతున్నారు. ఈ వస్తున్న దూరప్రాంతీయ కౌసల్యాది స్థానవాసులకు ఈ సంగతి తెలియదు. చనుపోతూ వున్న జనానికి నందుని ఇంట్లో నీల కన్పిస్తుంది. 'అమ్మా! నందయ్యగారి ఇల్లు ఇదేనా? శ్రీకృష్ణయ్యగారు నందయ్యగారి అబ్బాయిట; ఇంట్లో వున్నాడా! చూడగలమా" అని దాన్ని అడుగుతారు. అది సిగ్గుపడుతుంది. ఏమీ చెప్పలేక పోతుంది వీరికి ఎట్లాగో తెప్పరిల్లి "బాబ ఇంట్లో లేడు"— అంటుంది వచ్చినజనం—"అయితే ఎక్కడ కన్పిస్తాడు"అని అడుగుతారు "కొండదగ్గర" అని నీల చెబుతుంది అప్పుడప్పుడు రోహిణి కపిల మాటలువిని—నీకు ఎట్లా తెలుసే! వాడు కొండదగ్గర వుంటాడని?" అంటుంది ధర్మదను పిలిచి—"రామా! ధర్మా! నీకు నా వాడి రాకపోకలన్ని అకళింపు అయిపోయినాయి"—అంటుంది. ధర్మద సంతోషాన్ని పట్టలేకపోతుంది. "రోహిణి తల్లీ! ఇది అంతా మీ గలుగు" అంటుంది. "నాదలవా! బాగా చెప్పింది అది ఈ చిట్టి తల్లి నీల, చేసుకున్న పూర్వపుణ్యం" అంటుంది రోహిణి ఇటువంటి సంభాషణలతో నందుని ఇల్లు ఆనంద తుందిలమై అందరికీ కన్నులకు పసందుగా, చెవులకు విందుగా అందాలు చిందుతోంది.

గిరియజ్ఞం వచ్చింది ఘోషాన్ని ఎంతో అందంగా అలంకరించారు. ఎంతో అందంగా అలంకారాలు చేసుకొని గోపకులు, గోపకామినులు గిరియజ్ఞ దర్శనోత్సవలాలసులై ఆశలు మోసులు వారగా వస్తావాలు జరుపుకుంటున్నారు గిరిదైవతానికి నైవేద్యాదికాలు సమర్పించడానికి పేశలములైన పాయసాలు బహువిధములైన భోజనద్రవ్యాలు సిద్ధంచేసుకుంటున్నారు. కుండలలో మంచినీళ్ళు పోసి తీసుకుపోవడానికి సవాళ్ళు చేసుకుంటున్నారు మధురమయములైన నదులలో సాకలమాదిరిగా పాలతో, సుగంధి జలాతో ఘోషంలో కుండలు ఒప్పుతున్నాయి భక్ష్యాలు, భోజ్యాలు, చోష్యాలు. కుండలతో మోసుకుపోవడానికి. బళ్ళమీద తీసుకుపోవడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి ఉత్సవం మూడు రోజులపాటు జరుగుతుంది. మూడు రోజులూ భోజన సత్రాలూ, సంతర్పణాలు వుంటాయి. బహు ప్రాంతాలనుంచి జనం ఈ ఉత్సవాన్ని చూడ్డా

నికి వచ్చాక వస్తున్నారు. ఈ జనంతో ఘోషం సముద్ర ఘోషను పోలి కోలాహలంగా వుంది. కొంతమంది పశువులను బలి వేస్తామని మొక్కుకొని, వాటిని బళ్ళమీద ఎక్కించుకొని తరలి వస్తున్నారు. నీలకు ఈ సంరంభం అంతా ఎంతో ఆనందాన్ని కల్గి స్తున్నది. దానికితోడా ఇక్కడి గోపికలాగా అలంకారం చేయిం చుకోవాలని వుంది. రహస్యంగా తల్లితో ఆ మాట అన్నది ధర్మద, యశోదకు, రోహిణికి ఆ మాట చెప్పింది. రోహిణి అన్నది: "ఇక నువ్వు కట్టవలసిన వేషమే అది. రా! నేను అలంకరిస్తాను" నీల ఆనందం హద్దులు లేనిదైపోయింది. రోహిణి ఆనందం పొంగుతూ నీలకు అలంకారాలు చేసింది చేతికి కంకణాలు తొడిగింది. మెడలో కంఠసూత్రాలు వేసింది. చెవులకు కమ్మలు పెట్టింది దానిచేత ఘాగరను కట్టించింది. నీలయొక్క కన్నోవాలు సూర్యరశ్మి ఇంకా పోని అంభోజకోరకాలను పోలివున్నాయి. రోహిణి తానే నీల వస్త్రపు స్తనవల్కలాన్ని ఏరి స్వయంగా కట్టింది. కడుతూ "పిల్లా! నువ్వు ఇంకా ఒళ్ళు చేయాలే" అంది. అంతలో కృష్ణుడు వచ్చాడు. లోపలకు పోబోతూ వుంటే-"ఆగు! తండ్రీ! ఆగు! లోపల రోహిణీ తల్లి నీలను పెళ్ళికూతురును చేస్తున్నది"—అన్నది యశోద. ధర్మదముఖం సూర్యరశ్మికి పద్మంలాగా వికసించింది. "ఏమమ్మా! యశోదమ్మా! నేను ఆ పెళ్ళికూతుర్ని చూడరాదా ఏమిటి?" అన్నాడు కృష్ణుడు "ఇక చూడు! రాయనా! అలంకరించాను" అన్నది రోహిణి. నీల ఒడలెల్లా సిగ్గుగా నిలబడిపోయింది. కృష్ణుడు ఆ నీలను చూచి పెదవు విరిచాడు. "రోహిణీ అమ్మగారు! మీరు రాదగూడుక్కోండి" అన్నాడు. నీలకు ఒడలెల్లా దుఃఖమైంది. "అదా! తండ్రీ! ఇక పద! నేను చూచుకుంటాను" అన్నది రోహిణి. కృష్ణుడు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వెళ్ళిపోయి నాడు.

గిరియజ్ఞోత్సవ సన్నాహం అంతా తన నెత్తిమీదుగా వహిస్తున్నట్లు నందుడు పనిచేస్తున్నాడు. ఊరంతా కలయ తిరుగుతూ అందరికీ బయలుదేరతీస్తున్నాడు. నందయ్యగారి భావమది! అయన చెబితే అడ్డేమిటి! అంతా గిరియాత్రకు సిద్ధం అవుతున్నారు. గోపాలకామినులు ఆబాలవృద్ధంగా అందంగా తైసేసుకున్నారు. గోపాల కుమారులు కూడా అసురాకారాలు పోలి తగ దళత్కుసుమరాజితో అలంకారాలు చేసుకున్నారు. పాయసములు, అపూపములు, మోదకములు లోనైన అన్నాలను, పెక్కు మాంసములను వ్యాగ్యమధువులను, బహువిధ వ్యంజనాలను. పెరుగు, పాలు, నేయి మొదలైన ద్రవ్యాలను కావళ్ళకు ఎత్తారు. బళ్ళమీద ఎక్కించారు. తూర్యపటహాది వాద్యములు మ్రోగుగా యాత్ర ప్రారంభమైంది. సర్వ వస్త్రధరులైన గోపాలకులు గోవులను, వృషభములను, గోవత్సములను మందలు కట్టించి ఆ వెనుక తోలుకువస్తున్నారు. వృషభ గర్జితములతో, గోవుల, గోవత్సాల అంబారవాలతో బృందావనం పిక్కటిల్లి పోయింది. వృద్ధగోపకులు ముందు నడుస్తూ యాత్ర నడిపిస్తున్నారు. కులీన కుటుంబులయిన గోపకులు స్త్రీలను పాటబళ్ళలో ఎక్కించి గోవర్ధనానికి ప్రయాణంచేశారు. నందుని పాటబండి ఇంద్రుని రథం లాగా అలంకరించబడింది. శ్రీధాముడు తోటిగో కూర్చుండి బండిని తోలుతున్నాడు. ఆ వెనుక తక్కినబళ్లు. పెళ్ళి ప్రయాణంలాగా సాగిపోయింది. శ్రీకృష్ణుడు ఈ ఉత్సవ యాత్రలో ఎక్కడ వున్న వాడో, హఠాత్తుగా బండిదగ్గరకు వచ్చి నిలబడి, లోపలకు తొంగి చూశాడు. అతని కళ్ళు నీలమీద వ్రాలాయి. మన్మథుని పూవుల ములుకులు వాలినట్లు వ్రాలాయి నీల సిగ్గు అనే పూలపటాన్ని కప్పు కొన్నట్లు, అవనతవదన, సితాపాంగవీక్షణ, అతిమాధుర్య వరసు సీమ, రోహిణి చాటుగా అందం దాగిపోయినట్లు ఒరిగిపోయింది. ఇప్పుడు దాని తలలో పూవులు. మెడలో పూవులు, చెవులలో పూవులు, మన్మథుని తూపులు మూర్తిమంతం అయినట్లు వుంది. ఆ తూపులలో శ్రీకృష్ణుని చూపులు మత్తసారంగ పక్షమైన వేగంతో సౌందర్య మధువును అందుకుంటూ వేణువులు ఊదాయి. నీల అనే పుత్తడిబొమ్మలో లావణ్యాలు వెదికాయి. బావ తిరిగి సాగి పోతూవుంటే చూచి ఇంతకంటే మనుష్యులలో ఉత్తముడు ఎవడు అనుకుంది నీల. దేవతలలో ఇంద్రుడే పురుషుడు; మనుష్యులలో బావే పురుషుడు అనుకుంది నీల. తనబావ ఎంతటి ప్రతాపవంతుడు! ఎంతటి తీక్ష్ణబుద్ధి! దేవతలలో సూర్యుడికి, మనుష్యులలో బావను పోలిక చెప్పుకుంది నీల. కాంతిలో, ప్రసాదగుణంలో, సౌభాగ్య



నిర్వర్తింపజేశాడు. ధూపదీప నైవేద్యాలు పెట్టించాడు. ఆ తర్వాత గిరియజ్ఞం జరిగింది. యజ్ఞానికవలయు సర్వసామాగ్రులను, సంభారాలను సంపాదించుకొని, ఋత్విక్ బ్రాహ్మణులను రప్పించి, వారిచేత గోపకులు గిరియజ్ఞం నడిపించారు. పదపడి అవభృథస్నానాలు పూర్తిచేసుకున్నారు. శ్రీకృష్ణుడు ప్రధానుడై, ఈ గిరియజ్ఞాన్ని నడిపించిన కారణంచేత, అతడు ముందుగా మధుప్రాశనం చేశాడు. మహా ఇష్టంతో ఆ కృష్ణుడు పాలను గ్రోలగా, యజ్ఞం నిర్విఘ్నంగా పూర్తి అయినట్లే గోపకులు భావించారు. అంతలో ఒక అద్భుతం వారికి దృష్టిగోచరం అయింది. ఏ అపూపాలను, పాయసాలను అన్నాలను, మాంసాలను, శ్రీకృష్ణుడు తానై గిరిదైవతానికి నైవేద్యం పెట్టాడో, ఆ అపూపాలు పాయసాలు, అన్నాలు మాంసాలు, కుప్పలుగావున్నవి, విచిత్రంగా హరించిపోతున్నాయి. ఇది ఏదో అద్భుతం జరుగుతున్నదని, ఉత్సవదిదృక్షచేత వచ్చిన జనం అంతా అనుకున్నారు. నీల స్త్రీలలో వుండి ఈ అద్భుతాన్ని తిలకిస్తూ, తన్మయీ భావాన్ని పొందుతోంది. ఆపిల్లలో కదన, కలుగుతున్న, మార్పును అంతా చూస్తున్నారుగాని, అసలు విషయం రోహిణీదేవి మాత్రమే కనిపెట్టింది. నీల ఒకసారి తనదృష్టిని కృష్ణునిమీదకు పరుపుతుంది. ఇంకోసారి కొండమీదకు పారిస్తుంది పారించి తనలో ఏదో అనుకుంటుంది. "ఏమే! ఏవిటేలోపల అనుకుంటున్నావు? మేము వినకూడదా?" అంది రోహిణి. తక్కిన గోపికలకు అప్పుడు అక్కడ జరుగుతున్న అద్భుతమే అద్భుతము కాగా, ఇక్కడ ఈ నీలలో తోస్తున్న అద్భుతపరివర్తన అంతకన్నా అద్భుతంగా వుంది. "అమ్మా! రోహిణీతల్లీ! నేను ఆగిరిపై ఒక చెట్టునై ఎందుకుపుట్టానుకాదు! ఆ గిరిమీద ఏ వీరుంధానో ఎందుకు అయినాను కాదు. అప్పుడు నాజన్మ ఇంతకన్నా సార్థకంఅయివుండేది. చరితార్థం అయివుండేది" అంది. అని కృష్ణునివంక చూచింది. తిరిగి గిరివంక చూచింది. "ఈపిల ఏమిట? దానిలో కలుగుతున్న ఈ భావపరిణామం ఏమిటి?" అనుకుంది రోహిణి. "తల్లీ! మీరు ఆ గిరిని చూస్తున్నారా? స్వామి చలాకృతియై, అచలాకృతియైన తన్ను తాను ఆరాధించుకొని, తనకు తాను నైవేద్యం అర్పించుకొని, తనకుతానై ఆరగిస్తున్నాడు. తల్లీ! నన్నుకూడా అట్లా ఆరగించవలసిందని స్వామికి చెప్పరాదా? స్వామికి మీరంటే ఎక్కడ లేనిగౌరవమువుంది" అని గద్గదయై అభిప్రార్థనంచేసింది. ఉత్కంఠచేత దాని శరీరం రసమయమైనట్లు వుంది. దాని కన్నులు రసకాసారములయినట్లు వున్నాయి. దాని శరీరం గరుపారింది. పరమేశ్వరుడైన విష్ణువుయొక్క మహాస్పర్శచేత భూదేవత పులకాంకితగాత్రిఅయినట్లు వుంది. రోహిణి అప్పుడు కృష్ణుణ్ణి చూచింది. గిరిని చూచింది. ఆ గిరి కృష్ణుణ్ణిపోలివుంది. అదే నీలవర్ణం; అదే అందం; అదే ఆకారం; ఆగిరి కృష్ణమూర్తియై నైవేద్యోపహారాలను ఆరగిస్తున్నది. రోహిణికి అద్భుతమైపోయింది. "నీలే! నీవు తండ్రి మనస్సునే" అంది. నందగోపుణ్ణి పిలిచి "ఈఅద్భుతాన్ని దర్శించావా?" అన్నది. "ఆ! దర్శిస్తూనే వున్నాను" అన్నాడు నందుడు. "అది కాదు, ఇది" అంటూ రోహిణి ఆనందునికి ఆగిరిని చూపించింది. నందుడు చూచాడు. అది ఏమిదర్శనం! అచింత్యమైన దర్శనం! అవ్యవహార్యమైన దర్శనం! అగ్రాహ్యమైన దర్శనం! అప్పుడు తన నేత్రాలకు అది చింత్యమై, వ్యవహార్యమై, గ్రాహ్యమై కన్పిస్తున్నది. 'యశోదే! యశోదా! స్వామిని నీవు పెంచినవు: ఈ రూపాన్ని దర్శించు" అన్నాడు. యశోద చూచింది. ఆమూర్తి బాలుడై పూతన చనుబాలు గ్రోలుతున్నట్లు, శకటుణ్ణి తన్నుతున్నట్లు, యమళార్జునభంజనం చేస్తున్నట్లు, కాళీయఫణి ఫణామండలంమీద నాట్యం చేస్తున్నట్లువుంది. ఇప్పుడు గిరియై, ఆగిరిలో తానై కృష్ణునిమూర్తి కన్పించింది. కృష్ణుని ఉదయం అప్పుడు దేవకి పొందిన ఆనందమే ఆనందం! ఇప్పుడు యశోద పొందిన ఆనందమే ఆనందం! ఆదంపతులు ఆగిరికి అక్కడే సాగిలపడ్డారు. "భగవన్! నేను నీచేతులలోనివాణ్ణి. నీకు దాసుణ్ణి. కింకరుణ్ణి. నన్ను ఆజ్ఞాపించు" అన్నాడు నందుడు. నందుని ఈవర్తనం అందరికీ ఇంకో అద్భుతమై తోచింది. "నందయ్యా! ఎవరా భగవంతుడు? ఇంద్రుడేమైనా నీకు ప్రత్యక్షం అవుతున్నాడా? మనమీద కోపగించడం లేదుగద!" అన్నారు. "అట్లా ఆ కొండను చూడండి. నిర్మలమైన మనస్సులతో చూడండి" అన్నాడు నందుడు. వారు చూచారు. ఆశ్చర్యపోయినారు. అక్కడ ఆకొండ అధిత్యకమీద ఎవ్వరు? కృష్ణునిలాగా వున్నాడే! మరి ఇక్కడ ఈ కృష్ణుడు? వారు ఆ అద్భుతాన్ని భరించలేకపోయినారు. "కృష్ణా! కృష్ణా! నువ్వు భగవంతుడవి. నువ్వు ఎంత దాస్తేమాత్రం అది దాగుతుందా?" అన్నారు. వారుకూడా గిరికి సాగిలబడి మ్రొక్కారు. కృష్ణుడుకూడా వారితో గిరికి సాష్టాంగప్రణిపాతంగా వందనం ఆచరించాడు. "తనకుతానే ఈ వందనం ఏమిటి?" అనుకుంది నీల. తనలోవున్న కృష్ణునికి తాను ప్రణామంచేసింది.

కుంభుడుగాని, ధర్మదగాని. అసలు ఈ లోకంలో వున్నట్లు లేరు. బృందావనంలో అడుగుపెట్టినదగ్గరనుంచీ వారికి అంతా అద్భుతంగానేవుంది. ఇది సర్వసాధారణమైనలోకంగా లేదు. ప్రలంబవధ! ఇప్పుడు ఈ అద్భుత దర్శనం! యిట్టి అద్భుతాలు ఇక్కడ తప్ప మరియెక్కడనైనా జరిగాయా! జరిగితే తాము చూచారా? కుంభుని మనస్సు అప్పుడు యోగియొక్క మనస్సును పోలి అభయం అయిపోయింది. ధర్మద నీలను చూచి, ఆ కూతును కన్నందుకే తన జన్మ ధన్యమైంది అనుకొన్నది. శ్రీధామునకు ఇందులో క్రొత్తయేమీ కన్పించలేదు. వాడికి బావదేముడు; బలరాముడు దేముడు. వాళ్ళు ఇంతకన్నా అద్భుతాలు చేయగలరు. వాడు నీలదగ్గరకువచ్చి "నీలీ! నేను చెప్పలేదుటే" అన్నాడు. నీల "అవును, అవును" అంది. అక్కడి సర్వగోపాలగోపాలీప్రకరము మున్నూ సర్వాంగప్రణిపాతంగా "భగవన్! మేమంతా నీ చేతిలోని వాళ్ళం; నీకు దాసులం; కింకరులం; ఏమి ఆజ్ఞాపిస్తావు" అంటూ అభిప్రార్థనం చేస్తున్నారు. ఆ అభిప్రార్థనాన్ని గిరియైన దైవం, దైవం అయిన గిరి వినినట్లు, ఆ అభిప్రార్థనాన్ని అనుగ్రహించినట్లు, గిరిప్రభవాలై ఈమాటలు విన్పించాయి: "మీపూజ నాకు నచ్చింది. నేను మెచ్చాను. తృప్తి పొందాను. ఇగ ఆదిగా మీరు ఈ అద్రిమూర్తినైన నన్ను దైవంగా ఆరాధించాలి. అప్పుడు మీ కోరికలు ఏ కొరతా లేకుండా తీరుతూవుంటాయి. గోవులు ఎక్కడవున్నా సరే నిత్యామృతస్యందినులై మిమ్మల్ని పోషిస్తూ వుంటాయి. నేను కూడా మీ మీది ఆదరంచేత ఇచ్ఛాశరీరినై మీలో విహరిస్తూ వుంటాను. శివశ్చవోభవిష్యామి, మద్భక్తానాం వనేచరః రంస్యేచ సహ యుష్మాభిర్యథా దివిగత స్తథా."

మేదినిమీద ఈ కృష్ణునకు గిరిశృంగంమీద ఆకృష్ణునకు గోపముఖ్యులు పొంగి చేతులెత్తి, కేల్మొగిచి, నమస్కారాలు చేశారు. ఒక్క మనుష్యులేకాదు; అప్పుడు అక్కడి స్థావరజంగమాత్మకమైన సర్వ జగత్తున్నూ, ఆ మహామూర్తికి నమస్కారం చేస్తున్నట్లు తలలు వంచింది. ఆవులు అంభారవాలు చేస్తూ ముంగటకు వచ్చాయి. తలలు ఎత్తి కొండమీది కృష్ణుణ్ణి చూచి, తలలు వంచి భూమిమీది కృష్ణుణ్ణిచూచి కళ్ళల్లో ఆనందాన్ని చిమ్ముతూ, చెవులు గరుపారగా, చిందులు త్రొక్కాయి. గిరిశృంగస్థితుడైన దైవం మళ్ళీ ఇట్లా అన్నాడు: "నందగోపుడు మొదలైన గోపకులు నాకు చేసిన ఈ పండుగకు సంతోషించాను. ఆ గోపకులకు ప్రీతిగా ధనాలు ఇస్తున్నాను. అన్నిధనాలలోను నాకు గోధనాలు ప్రీతికరాలయినవి. ఆ గోవులను వెంటనే నా దగ్గరకు తీసుకురండి. నాచుట్టూ ప్రదక్షిణాలు చేయించండి. అందువల్ల నాకు కలిగే ప్రీతి మరి ఎందువల్లను కలుగదు". ఈ మాటలు చెప్పి ఆ మూర్తి అంతర్ధానగతుడైపోయినాడు. అంతా అప్పుడు ఒక్కసారిగా భూమి మీది కృష్ణునివంక

(55-వ పేజీ చూడుడు)




# రాబిన్ హుడ్

## 13

(గతసంచిక తరువాయి)

అది అందమైన వెన్నెల రేయి!

చల్లగా తెల్లగా హాయిగా ఉంది. ఆ రేయిలో హాయికీ హాయిలో రేయికీ దూరం లేదు. అవి రెండు కావు. ఆ రెండూ ఒకటై పండు పండి పండు వెన్నెల కాస్తున్నాయి. నీలి దుప్పటంలో పకపకలాడుతున్న పాపలా ఉన్నాడు చందమామ కొందరికి. వాళ్లకి పాల పాపలు న్నారు. మరికొందరికి చందమామ అందరాని అందమైన పండులా ఉన్నాడు. వీళ్లకు పెళ్లి కాలేదు. ఇంకొందరికి చందమామని చూస్తే కందగడ్డవుతోంది మొహం. వీళ్లు పెళ్లిళ్లు చేసుకుని కొత్తగా మత్తుగా ఉన్నారు.

హాయికదా అని వీళ్లు వెన్నెల లోకి వస్తే రేయికదా అని చందమామ కనిపించేవాడు! వీడికి వేళా పాళా లేదు అనుకునేవాళ్లు వీళ్లు. ఆ మాటకైనా మొహమాట పడి మొహం మాటు చేసుకోటం లేదు చందమామ!

'మబ్బు గుల్లాలమీద బబ్బుని చందమామయ్య దగ్గిరికెళతా' నసే పాలబొసల పాపలు హాయిగా కన్ను మూతలు పడి అన్నంతపనీ చేసేస్తున్నారు!

'అందమైతే నుటుక్కు అర్థం ఉండఖర్లా—ముక్కూ మూతీ లేని సిబ్బె మొహం' అన్నట్టు ఓ నిక్షేపరాయుడు మూతి ముప్పైమూడు వంకర్లు తిప్పి అటు తిరిగి పడుక్కున్నాడు చందమామను చూడకుండా.

'అదేంట్రా నీ మొహం—అంత చందంగా ఉంటే అందమామా' అని మరోడు సరోజాగా అనేశాడు.

"అందమామా వేంటిరా నీ బొంద మావం" అంటూ వాడు మరో చురక అంటించాడు.

---

శుభశ్రీ

---

'ఎంత చల్లగా ఉంది వెన్నెల' అని ఓ నిక్షేపరాయుడు ఎదురొమ్ము అరచేత్తో అదుము కున్నాడు.

'నీకేవఁన్నా మతిగానీ పోయిందా. ఒకటే మంటగా ఉంటే చల్లగా వుందిట. వెన్నెల వేడికి మాడి సేపుస్తుంటే—ఎక్కడ దొరికారోయ్ మీరంతా' అన్నాడు విసుగ్గా మరో నిక్షేపం!—ఇతనో పల్లెటూరి పిల్లదాన్ని చేసుకోవాలనుకుని నానా తంటాలూ పడి—ఎప్పుడూ ఆమెని గురించే ఎన్నో అనుకుని ఓ చెట్టునానుకుని కునికిపాట్లు పడుతున్నాడు.

మరోపక్క లిటిల్ జానూ, ఫ్రయర్ టక్కూ ఆ వెన్నెట్లో పడుకుని చల్లగా కబుర్లు చెప్పుకుంటున్నారు. దూరాన ఎక్కడో అడవి చెట్టుమీదినించి 'స్కైలార్కు' పిట్ట పాటపాడుతోంది. ఆపాట చందమామలా అందంగా, వెన్నెల్లా చల్లహాయిగా, గాలుల్లో సన్నసన్నగా వినిపిస్తోంది. ఫ్రయర్ టక్కు చటుక్కున లేచి కూచుని 'హాయిగా ఉందికదూ' అన్నాడు.

'అవునుమరి వెన్నెలరేయికదూ' అన్నాడు లిటిల్ జాన్.

'సరిసరేగాని హాయీ రేయీ అక్క చెల్లెళ్లేంటి చెప్మా' అన్నాడు ఫ్రయర్ టక్ నిజంగానే తెలీక.

వాళ్ళకిది రేయా, హాయా అనే ఆలోచన పట్టుకుంది. ఇద్దరికీ తేడా వచ్చింది.

లిటిల్ జాన్ కీ ఈ సందేహం ఉంది. కాస్సేపు ఆలోచించి "నాకు చూస్తే అసలీ హాయీ రేయీ అనేవి రెండు కాదు ఒకటేనని పిస్తోంది. ఎందుచేతంటే నువ్వూ నేనూ యిద్దరం కద! నువ్వు ఫ్రయర్ వాయె-నేను జాన్నయితిని. నువ్వు వేరు, నేనువేరు మనుషులం—నీకలా నాకిలా అనిపించకపోతే నువ్వు నువ్వూకాదు నేన్నేనూ కాదు. ఏవంటావ్? ఇంతకూ ఏదైనా సరే— రాబిన్ చూడు-మనకిదొర—వాళ్లకి




దొంగ. నాకు మంచివాడు — షెరీఫ్ కి వంచకుడు. తమాషాదియ్యా ఇద్దిదే నాయ్ గమ్మత్తూ!" అన్నాడు లిటిల్ జాన్! ఫ్రయర్ ఆశ్చర్యపోయాడు.

'అయినా రాబిన్ వంటి రేడు మనవాడై సైదోడై వుండగా ఇది రేయిగాని హాయిగాని అవ్వాలి. మరోలెట్లా అవుతుంది' అని బిగ్గరగా నవ్వాడు ఫ్రయర్.

'ఉండు' అంటూ చెయ్యి చూపుతూ లేచి కూర్చున్నాడు లిటిల్ జాన్.

'ఇదుగో అటు విను' అన్నాడు చెవి వోరగా పెట్టి. జాన్, ఫ్రయరూ యిద్దరూ చెవులురిక్కించి విన్నారు.

ఏదో చల్లటి పాట! గుండె ఝల్లు కేహో!! మనసు ఝుమ్మనే పాట!! ఏం పాట? ఎక్కడి పాట? ఎవ్వరి పాట? పాట? లేదా మనం వినడం పొరపాటా? జలిబిలి గిలిగింతలు పెట్టి పులకింతలు రేపుతున్న ఈ పాట ఏ పొటన ఇలా వస్తోంది?

హాయికదా ఇది మాయకదా
తీయని వెన్నెల రేయికథా—
చిలిపిగ నవ్వే చిన్నరి తారలు
వంపులు తిరిగే వెన్నెలధారలు
పాలపాల విరిసే తెలితెలి మబ్బులు
తెలిమబ్బులపై తేలే ఊహలు! —
నీలిగతోచే నీ కనుసన్నలు
నాలో పాడే వెన్నెలసన్నలు—
నీనీడలు కట్టిన మేడలు
ఆమేడలలో ఆటలు పాటలు! —
గాలుల గుసగుసలాడిన హాయి
జాలిగ నాకెను కాదు పరాయి.
ఏలా బేలా కలుపవు చేయి
నాలో నీదే పున్నమ రేయి—

..."ఆ పాట చందమామ పాడుతోందా ఏమిటి?' అన్నాడు ఫ్రయర్!

"ఊహూఁ" అంటూ తల అడ్డంగా కాదని తిప్పి — "కాదోయ్. ఎప్పుడూ కనిపించే వెన్నెల ఇప్పుడు వినిపిస్తోందల్లే ఉంది! చూడ్డానికి తెల్లగా వినడానికి చల్లగా ఉంటుందన్నమాట వెన్నెల!!" అన్నాడు లిటిల్ జాన్. విన్నాడు ఫ్రయర్. అలా అన్నప్పుడతనికి, ఇలా విన్నప్పుడితనికి 'ఆహా' అనిపించింది — 'ఓహో' అనిపించలేదు ఎవరూ అనలేదు.

ఇద్దరూ లేచి పాటవైపు బాటపట్టి సూటిగా వెళ్లారు.

వెన్నెలలో జలతారు వెలుగు జిలుగులతో వెన్నెలవాగు పరవాగా జారిపోతోంది. ఆ సెలయేటి ఒడ్డున రాతిమీద పులిలా కూచున్నాడు ఎవరో మనిషి — అతనిపక్కనే ఓ అమ్మాయి కూడా ఉంది. మరీ దగ్గరకెళ్ళి చూశారు తుప్పల్లోంచి వీరిద్దరూ.

వాళ్ళ కళ్ళను వాళ్లు మొదట నమ్మలేకపోయారు. కాని నమ్మిచెప్ప వాళ్లు లేరని నమ్మారు చివరకి!!

ఆ కూచున్నది మేరియన్ ప్రియుడు రాబిన్. ఆ ప్రక్కన అతని ప్రేయసి మేరియన్. ప్రియుడూ — ప్రేయసీ కలసిన కొత్త సంగీతమై చల్లగా వినిపిస్తోంది! వెన్నెలై పొంగి పోతోంది. పిల్ల మనస్సై పొంగి పోతోంది.

ఫ్రయర్ అద్భుతంగా ఆశ్చర్యపడిపోయి 'ఈటె పట్టే వాడు 'ల్యూటు' పట్టినా ఈపాటికి ఈనాటికి రాజయిపోయేవాడు. రాజా రాలు

"హాయికదా ఇది మాయకదా తీయని వెన్నెల రేయికథా" అంటున్న రాబిన్, అనుకుంటున్న మేరియన్!!



పులో మోజుగా తెచ్చుకున్న ఈ 'లూటు' ఏ మూలో పడుండా ల్సిందే అనుకున్నా. చూడు జాన్. మన వాడెంత వాడో! లూటు కూడా లోటు చేయడు.' అంటూ ఆనందపడ్డాడు.

లిటిల్ జాన్ గుండె నిండుకుండల్లే తేనెతో నిండిపోయినట్లయింది.

'మనదొర నిజంగా దొంగే— ఎందుకనూ? తనకు సంగీతం వచ్చని మనకి చెప్పాడా? ఎవరికీ తెలీకుండా ఎప్పుడు ఎవరిగుండెలోంచి దోచుకున్నాడో ఈ పాట—' అంటూ ఆ పాట ఆలోచించుకుంటూ ఉండిపోయాడు.

అంతలో పాట అయిపోయింది. మేరియన్ రాబిన్ ఒడిలో వాలిపోయింది. ఆమె లేడిలా నాజూగ్గా వుంది. వెనక్కి తిరిగి చూసే సరికి వందమంది ముంద కనిపించింది. వీరులూ, నిక్షేపరాయుళ్లూ అంతా వచ్చేశారు.

'ఇస్' అని సైగ చేశాడు ఫ్రయర్. వీళ్లంతా చల్లగా దూరంగా అడివిలోకి వెళ్లిపోయారు.

"చూడండి. మన రాబిన్‌దొర ఇంతవరకూ కేవలం వీరుడనీ ఈటె పట్టగలవాడనీ మనమంతా అనుకున్నాం. కాని ఇంత రసికుడనీ, పాటకుడనీ, లూటు కూడా వాయించగలడని మనకి తెలీనే తెలీదు! అతను ఎప్పుడ్ నేర్చాడో మనకి తెలీదు. ఇవాళ యింతటివాడని తెలుసుకున్నాం. రాబిన్ పరగణాకే కాక మనకూడా దొంగే—దొంగతనంగా సంగీతం దోచేసుకుని దాచేసుకున్నాడు." అన్నాడు ఫ్రయర్.

ఓ నిక్షేపరాయుడు అందుకుని "మేరియన్ దొరసానికి ఒక్కదానికే పాడి వినిపిస్తున్నాడు చూడు మనం మాత్రం మాటతప్ప పాట వింటానికి పనికిరాం కాబోలు ముందొచ్చిన కొమ్ములకన్న వెనకొచ్చిన చెవులు వాడిట! ముత్తానికి భలేవాడే!" అని బోళాగా అనేశాడు.

అకనికంటె ఘనుడు ఒకడు— "మేరియన్ దొరసానికిమాత్రమే వినిపిస్తే నరే—ఏదో వినిపించుకున్నాడనుకుందాం. నా వెర్రికూలా— చెట్లు, పుట్ట, కొండరాళ్లు, సెలయేళ్లూ అన్నిటికీ ఆపాట అదే పాటగా వినిపించాడే. ఆపాటి మనం చెయ్యకపోయామా అంట!" అనేశాడు.

ఈ గొడవలో ఇంతలో వెనక నించి వెన్నెలనీడల్లో కలిసిపోతూ రాబిన్ హుడ్డూ, మేరియన్నూ వచ్చారు. వాళ్ల గొడవంతా విని వెన్నెల్లా నవ్వేశారు.

"ఇంతకూ నువ్వు పాటవా బందిపోటువా" అని అడిగి - నిలబెట్టిఅడిగానే అనుకున్నాడు ఓ వీరుడు!

"నేననేది వింటే తియని పాటని— వినకపోతే బందిపోటుని" అన్నాడు రాబిన్!!

'ఇహ మేం నీ పాటతప్ప మాట వినం' అన్నారు నిక్షేపరాయుళ్లు.

ఆ ఒక్కమాట అదో పాటగా వినిపించింది రాబిన్‌కి. అలా పాటలతో, మాటలతో ఆపూట ఆ తోటలో బాటసారై చల్లగా వెళ్లిపోయింది. ★

ఒకరోజు మా తమ్ముడు బస్సులో చేసిన తమాషా తలచుకుంటే ఇప్పటికీ నవ్వు వస్తుంది.

అసలు ఆ తమాషా ఏమిటంటే, పాపం! మా తమ్ముడు ఎక్కడ నేర్చాడో కాని, ఆవలింత వచ్చి నప్పుడు నోటిదగ్గర చిటిక వేసుకోవటం అలవాటు చేసుకున్నాడు. ఇంట్లో మేము ఎంత మందలించినా ఆ అలవాటు మానుకోలేకపోయాడు.

మొన్న వేసవిలో మా యింట్లో వాళ్ళమంతా కలసి, సరదాగా ఏదైనా పల్లెటూరిలో నాలుగు రోజులు గడపివద్దా మనుకొని, బస్సులో, మాకు ఇరువై మైళ్ల దూరంలో ఉన్న బిక్కవోలు అనే ఊరుకి బయలుదేరాం. నేనూ, మా తమ్ముడు ఒకే సీటులో కూర్చుని, రోడ్డు ప్రక్కనున్న పంటకాలవని, చేలనిచూసిఆనందిస్తున్నాం ఇంతలో ఎవరో ఒకావిడ వచ్చి నా ప్రక్కన కూర్చుంది. కొంచం సేపటికి, పాపం! ఆవిడకి ఆవలింతవచ్చి ఓ ప్రక్కగా తిరిగి ఆవలిస్తోంది. చేలను, పొలాలను చూస్తూ, తన్మయత్వంలో ఉన్న మా తమ్ముడు వాడి పొమ్మే నో పోయినట్లు గబగబా ఆవిడ నోటి దగ్గర చిటికలు వేయటం మొదలు పెట్టాడు. ఆవిడ ఒక్కసారిగా ఉగ్ర రూపం ధరించి, మా వాడిని తిట్లకు లంకించుకుంది. అప్పుడు మేమంతా కలసి, ఆవిడకి సర్ది చెప్పేసరికి మా తాతలు దిగివచ్చారంటే నమ్మండి!

ఈ సంఘటన జరిగిన తరువాత, ఎవ్వరూ చెప్పకుండానే, మా తమ్ముడు ఆ అలవాటు పోగొట్టుకున్నాడు. ★

—కల్లూరి అనంతలక్ష్మి

# ఎలుకపిల్ల సాహసం

★ విజయలక్ష్మి ★

"తాతయ్యా! తాతయ్యా! మాకో కథ చెప్పవా?" అన్నారు సాయంత్రం ఆడుకొని అలసిపోయిన పిల్లలు. అరుగుమీద కూర్చొని చుట్టకాలుస్తున్న తాతయ్య దగ్గర చేరి "తాతయ్యా! నాకు నువ్వు నిన్న చెప్తానన్న ఎలుక పిల్లకథ చెప్పవా" అంది తాతయ్య మెడకు చుట్టుకుపోతూ సరళ. బాబు "నాకు నక్క కథ కావాలి తాతయ్యా" అన్నాడు. "కాదు నాకు రాబిన్ హుడ్ కథ చెప్పాలి" అన్నాడు క్రిష్ణ. రాబిన్ హుడ్ సాహసాలు వినడానికి కుతూహల పడే తక్కిన పిల్లలు కూడా క్రిష్ణకే బలపరిచారు. 'సరళ అందరికన్నా చిన్నది కనుక అందుకని యివాళ దానికథ చెప్తా రేపు బాబు గాడికథ, ఆ తర్వాత యింకన్నీ మీ కథలే' అన్నాడు తాతయ్య. విజయ గర్వంలో రెండింతలైన సరళ ముఖం వంక చూస్తూ క్రిష్ణ పాపం నీరసించిపోయాడు.

"అనగా అనగా ఒకవూరిలో ఓ ఎలుక పిల్ల వుంది" అన్నాడు తాతయ్య. "నీలా కథలు చెప్పే తాతయ్య వున్నాడా తాతయ్యా ఆ యెలుక పిల్లకి?" అని కొంటెగా నవ్వింది సరళ. "దానికి అమ్మా, నాన్నా వున్నారా తాతయ్యా?" అని అడిగాడు అమాయకంగా బాబు. "దానికి ఆడుకోటానికి ఫుట్ బాల్ వుందా తాతయ్యా?" అని క్రిష్ణ ప్రశ్నించాడు. తాతయ్యకి ఊపిరాడలేదు సమాధానాలు చెప్పేందుకు.

"నన్ను కథ చెప్పనిస్తారా? లేదా?" అని కొంచెం కోపం నటిస్తూ అనే సరికి మళ్ళీ అంతా గప్ చిప్ అయిపోయింది.

ఆ యెలుకపిల్ల ఓ కలుగులో నివసిస్తుండేది. సరళలాగ అందరికంటే చిన్నదవటం మూలంగా దాన్ని కన్నం వదలి బైటికి రానిచ్చేవారు కాదు దాని అమ్మ నాన్న.

ఒకరోజు దానికి బైట యేముంటుందో చూడాలని బుద్ధిపుట్టింది. మరి అమ్మ నాన్న వుంటే బైటికి రానీయరుగా అందుకని సమయం కోసం ఎదురు చూడసాగింది ఆ చిన్నారి ఎలుకపిల్ల.

హమ్మయ్యా! ఎదురుచూచిన రోజు రానే వచ్చింది. ఆరోజు అమ్మ, నాన్నా, అన్నా, అక్క అందరూ ఆహారం కోసం వెళ్ళిపోయారు. అప్పుడు యెలుకపిల్ల యేం చేసిందో తెలుసా? ముందు కన్నంలోంచి బుర్ర పైకి పెట్టి చూసింది. అది తెల్లవారు ఝాము ఇంకా చీకటిగా వుందేమో అంతా మసకమసకగా కనబడింది పైకి ఒక్క గంతేసింది. ఎక్కడా అలికిడి లేదు. అంతా తన రాజ్యమే అనుకొని యింకా ముందుకు సాగింది. అక్కడే దానికి కోళ్ళగూడు దానికి కొంచెం దూరములో ఒక గిన్నె ఆ గిన్నెలో కోళ్లు తినగా మిగిలిన మేతా కనిపించాయి. ఆ మేత కడుపునిండా తిని "అమ్మా నాన్నా తన్ను యెందుకు పైకి రానీయరా?" అనే ఆలోచనలో పడింది. అంతట్లోకే కోడిపుంజు "కొక్కొరోకో" యని కూసింది. దానికి అదిరిపడి అటుతిరిగి చూసింది. అదోక పెద్ద జంతువనుకుంది. దాని సూది ముక్కు చూసి పొడిచేస్తుందేమోనని భయపడి గిన్నె వెనుక నక్కి దిక్కులు చూడసాగింది. అక్కడే పడుకున్న ఓ పిల్లి దానికంట బడింది. అమ్మ ప్రతిరోజూ వర్ణిస్తుండే క్రూరమైన జంతువు. తమ శత్రువు యిదేనేమో ననుకుంది కాని దానికళ్ళకు ఆ జంతువు అమ్మ వర్ణించేంత క్రూరంగా కనబడలా. అయినా యింకొంచెం ముందుకు వెళ్ళి బాగా పరిశీలిద్దామనుకొని, రెండడుగులు వేసేసరికి, కోడిపుంజు రెక్కలు దులుపుకొని మళ్లీ "కొక్కొరోకో" యని కూసేసరికి కోడిపుంజు తనను పొడవటానికి చేస్తున్న సన్నాహమనుకొని హడలిపోయి గుండెదడతో యేం చెయ్యడానికి తోచక అలాగే నిలుచుండిపోయింది. పిల్లి సగం విప్పిన కళ్లు చూసేసరికి భయం మరీ యెక్కువైంది. భయంతో సతమతమౌతున్న యెలుకపిల్లకు మెరుపులాంటి ఆలోచన తట్టింది. వెనకు తిరిగి చూడకుండా, ముందూ వెనకా ఆలోచించకుండా కన్నందగ్గరకు ఒకటే పరుగు తీసింది.

దుప్పటి ముసుగుపెట్టి వణికిపోతూ పడుకున్న పిల్లను, అప్పుడే వచ్చిన

(47-వ పేజీ తరువాయి)

చూచారు. ఆ కృష్ణుడు అప్పుడే వేణువును ధరించి, గోవ్రాలవైపు ముఖమై, వాటిని ఆహ్వానిస్తున్నట్లు, పేరు పేరునా వాటిని పిలిచి అభినందిస్తున్నట్లు, ఏవో మధురాతిమధురమైన సంగీతాలు వూదిపోస్తున్నాడు. ఆ గోవులు ఆనందాతిరేకంతో అతని చుట్టూ చేరుతున్నాయి. ఆ గోవులు అన్నీ అలంకరించబడి వున్నాయి. పూలతో, ఆభరణాలతో అలంకరించబడి వున్నాయి. శిఖలలో పూలు; కొమ్ములకు పూలు; మురగాళ్ళకు పుష్పస్తబకాలు; కిరీటోపమంగా అలంకరించబడినాయి. ఆ గోవులు వేగగమనం కల్గి, సంతోషం పొందుతున్నట్లు, కృష్ణుని చుట్టూ పాల సముద్రం తరంగాలను పోలి కదలాడాయి. గోపాలకులు అప్పుడు ఆ గోవులను అర్చించారు. కాళ్ళకు కట్టిన చిరుగజ్జెలు మ్రోతలుగా, మెడలకు కట్టిన బంగారపు మువ్వలు సవ్వడిగా, ఆ గోవులు కృష్ణుని వేణువునుండి వెలువడుతున్న సంగీతాలకు అనుగుణంగా తరంగలించాయి. ఆ తెల్లని శరన్మేఘాలను పోలి చెంగలించాయి. రంగు రంగుల పరిధానాలతో శృంగారాలు చేసుకున్న గోపాలాంగనలు గో బృందాలతో పాటు సుందర పద విన్యాససమ్మతంగా లాస్యాలకు దిగారు. నీల నాట్యం ఎంత నేర్పుకలదో అప్పుడు అక్కడివారికి తెలిసింది. కృష్ణుడు వేణువును ఊదగా ఎన్ని భంగిమలలో నాదం పుట్టుకు వస్తున్నదో, అన్ని భంగిమలలోనూ, నీల, నాట్య సుందరియై ఆ నాదానికి మూర్తికల్పన చేస్తున్నట్లు, ఆ నాదమే తన రూపంగా వున్నట్లు, కదలాడిపోయింది. శరీరాలను నానావర్ణాలతోను అలంకరించుకున్నవాళ్లు, ఎఱ్ఱని తలపాగలు, తెల్లని వస్త్రాలను ధరించినవాళ్లు, నెమలికన్నులతోడి బాహుభూషణములను కైకొన్నవాళ్ళు, చేతులలో ఆయుధాలనుపోలి మయూరపత్ర వృంతాలను పట్టుకున్నవాళ్ళు, గోపయువకులు, ఆ గోవులలో, ఆ గోపికలలో, పరవశంతో పరవశులై పోయారు. కొందరుండి వృషభరాజాలను అధిరోహించి వృషకేతనుడైన, నటరాజును పోలి ఆనంద తాండవకేళీ రతులై చొక్కి మిగిలారు.

అంతలో కృష్ణుని వేణువు విచిత్రమైన ధ్వనులు చేసింది. ఎవరో వచ్చి తమ్ము ముందుకు కదలవలసిందని చెబుతున్నట్లుగా ఆ ధ్వనులు ఆ గోపకులకు విన్పించాయి. గోవు మహాలక్ష్ములకు నీరాజనాలు పట్టండని చెబుతున్నట్లు గోపికలకు విన్పించాయి. మందలుకట్టి కదుపులుగా విడి, ముందుకు కదలమన్నట్లు ఆ గోవులకు విన్పించాయి. గోవుల మందలు ముందుకు కదిలాయి. మనుష్యులు ముందుకు కదిలారు. నీరాజన హస్తలైన గోపికలు ఎవరి కదుపులలో వారు నాట్యహేల తొనెగులుగా కదిలారు. కృష్ణుని వేణువునుండి ఏవో కొంతలు పుట్టి, ఎయిలై, సంగీతమర్యాదమైన గమకాలతో, మూర్ఛనలతో, లయల హొయలతో గిరిని చుట్టి ప్రదక్షిణారంభం చేస్తున్నట్లు వున్నాయి ఆ కదలికలు. ముందు గోపాలురూ, ఆ వెనుక ఆవులు, వెనుక గోపాలురూ, ముందు ఆవులు, ఆవులకు ఆవులకు నడుమ, గోపాలరకు గోపాలరకు నడుమ—నీరాజనహస్తలైన గోపకామినులతో కమనీయసర్పమై నీరాజనోత్సవం సాగిపోతున్నది. కదుపులు కదుపులుగా గోవులు, వృషభాలు, గోవత్సాలు కదులుతూవుంటే, గోపకులు, గోపకామినులు నీరాజనాలు పట్టుకొని ఆ కదుపులతో కదులుతూవుంటే, శారదికమైన ఆకాశం భూమిమీదకు వచ్చి, గోవర్ధనం మేరువుగా ప్రదక్షిణక్రమం ఒప్పుతున్నట్లువుంది. నందుని మంద పెద్దది. రామకృష్ణులు ఆ మందతో గిరిప్రదక్షిణం చేయించారు. యశోద, రోహిణి, భద్రత, నీలు నీరాజనాలు పట్టుకొని ఆ గోవులతో కొండచుట్టూ నడిచారు. శ్రీధాముడు బావను వదిలివుండలేదు. నీల చూపులు కృష్ణునిమీద నుండి కదిలిరావు. ఈ ఉత్సవాన్ని చూచి నందుడు పొందిన ఆనందమే అంతులేనిదిగా వుంది. కుంభునికు ఇది గోలోక మాహాత్మ్య విశేషంగా కన్పించింది. గోలోకంలో గోవులు కృతాధ్యాత్మలై, అంభారవ బ్రహ్మగీతికములై, గోవిందనివాసక్ష్యపారమ్యశీల సుందరాలయి, వుంటాయని పౌరాణికులు చెప్పగా కుంభుడు విని వున్నాడు. ఇప్పుడు ఇక్కడ తాను విని ఆ గోలోకం కన్నుల యెదుట మహాద్వపూర్ణమై సాక్షాత్కరించినట్లు కన్పించగా, కుంభుడు అద్భుతం పడినాడు. ఈ కృష్ణుడే గోవిందుడు అన్న భావం అతనిలో మగుడుకుపోయింది. అతని మనస్సు నిర్భయమై వీతభయుం కావడంచేత పొందే ఆనందాన్ని పొందింది.

ఆ మరునాడు గోపకులు అన్నసత్రంచేసి బ్రాహ్మణతృప్తి కావించారు. ఆ సత్రంలో ఎక్కడచూచినా పాయసముల కొంపులు; బహువిధంబుల బూరెలు; అట్లు; నేతులు; పాలు; తేనెలు; ఏరులై వేలు వేలు ప్రవహించగా బ్రాహ్మణ ప్రవరులు బంతులుతీరి ఆ సత్రాన్ని అనుగ్రహించారు నందుడు యథాన్యాయంగా దక్షిణలు ఇచ్చి విప్రజనమనస్సంతర్పణం కావించాడు. సమస్త దీనానాధజనములు తినిపెట్లు ఆ తర్వాత కూడా గోపముఖ్యులు అన్నసత్రం కొనసాగించారు. ఇంత అయినతర్వాత తమ తమ వర్గములతో కూడి వారు యజ్ఞశేషాన్ని అమృతంగా ఉపయోగించి కొండపండువును సమాప్తించారు.

పర్వతోత్సవం నిర్విఘ్నంగా కొనసాగింది. ఇంద్రునికి కోపం వచ్చి ఏమన్నా చేస్తాడేమోనని ముందు అనుకున్న గోపవృద్ధులంతా ఇప్పుడు ఆశ్చర్యవిస్మితులైనారు. ఇదివరకు ఇంద్రోత్సవాలు జరిగాయిగాని పర్వతోత్సవం అంత అందంగా జరిగాయా ! ఆ ఇంద్రోత్సవాలలో ఇట్టి అద్భుతాలు కన్పించాయా ! ఇది ఏదో లోకాద్భుతంగా వుంది. కృష్ణయ్య ఎక్కడ వుంటే, అక్కడ ఏదో అద్భుతం తప్పదనే భావం వారిలో ఇప్పుడు మరీ బలపడిపోయింది. ఇప్పుడు వారి మనస్సులలో ఇంద్రుణ్ణి గూర్చిన ఆలోచనే లేదు. కృష్ణాభిముఖమైన ఆలోచనలతో అంతా వ్రజస్థానానికి బయలుదేరారు. నందుని పాలబండి ముందుగా, ఆవెనుక గోవుల మందలుగా కదిలివస్తూవుంటే, గోపాలకృష్ణ రజనీనాథుడు, ఇలవేల్పును కొలిచి మహాగోసైన్యంతో దండు కదిలి జైత్రయాత్ర ప్రారంభించినట్లు వుంది వారి ఆ ప్రయాణం.

బళ్లు యింకా మందకు చేరుకోలేదు. మందలు యింకా స్వస్థానాలలో ప్రవేశించలేదు. అప్పుడు ఆకాశంలో తెల్లని శరన్మేఘాలు నలుపు తిరిగాయి. అళికదంబాలను పోలి చిరుగర్జలుగా కదలాడాయి. శరత్తులో ఆషాఢ నవమేఘాలు తోచినట్లు ఆకాశం అకాలగర్జనం చేసింది. అంతా యిది ఏమిటా అనుకున్నారు. అంతలో ఒక చిలంత జల్లు చెల్లరేగింది. నందుని పాలబండిలో రోహిణీదేవి ఒడిలో బాలుడు సమీపంలో కూర్చున్న నీల తలయెత్తి ఆకాశం వంక చూచింది. ఒక జల్లు పెరపిరుకుగా వచ్చి దరదరవింటాన్ని పూరడించే దాని ముఖాన్ని చరచింది. ఆ జల్లుల అంచులు ఇంద్రుని వజ్రపుటంచులను పోలి దానికి బాధను కల్గించాయి.

నీల రోహిణీదేవితో అన్నది.

"అరే ! ఇంద్రునికి కోపం వచ్చింది."

"అరే ! మనం సంకర్షణ వాసుదేవ సంరక్షితులం."

ఆకాశంలో ఒక మెరుపు మెరిసింది. కృష్ణుని చేతిలో వేణువు సింహనాదాలు మొరసింది. ★

అంటారు. ఒకనిర్మాత రీ-రికార్డింగు అయ్యాక వాద్యగాళ్ళకు డబ్బు ఇచ్చేటప్పుడు ఒక మాండలిన్ ఆర్టిస్టుని ఆపి, "నువ్వు టింగు టింగుమని రెండుసార్లు మీటావో లేదో...దానికి అందరితోపాటు సమంగా పుచ్చుకుంటానంటే యెలా. ఓసారి తక్కువ తీసుకోవాలి" అని పేచీపెట్టాడు.

నౌషదలీ ఒకసారి ఒక ఘట్టానికి దాని స్వభావాన్నిబట్టి ఒక విషాదమైన సంగీతం కూర్చి రికార్డు చేశాడు. తరవాత చెప్పారు వారు అది తీసివేశారు. నిర్మాత అదెందుకు దండుగ పోవాలని ఆలోచించి కొత్తగా తీస్తున్న ఇంకో దృశ్యంమీద ఆ సన్నివేశాన్ని ఇమిడ్చేశాడు.

నౌషద్. తరవాత ఆ చిత్రం చూసినప్పుడు అక్కడ ఇటు విషాదసంగీతమూ, అటూ ఆ చిత్రంలో అఘాయిత్యమూ కూడా జాయింటుగా ఖూనీ అయిపోయాయని బాధపడ్డాడు. ఆ బాధను వ్యక్తీకరించడానికి అరవై వయొలిన్‌ల ఆర్కెస్ట్రా కూడా చాలదు అని విషయపరిజ్ఞానంగల దర్శకుడొకాయన అన్నారు.

(ఇంకావుంది)

# వార్తలు

## చోప్రా తెలుగుచిత్రం

బి. ఆర్. (నయాదౌర్) చోప్రా తన కొత్త చిత్రం 'ధూల్ కా ఫూల్'ను తెలుగు తమిళభాషలలో నిర్మించబోతున్నారు. నటీనటుల నిర్ణయానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని. 'ధూల్ కా ఫూల్' దర్శకత్వం వహించిన తన సోదరుడు యాష్ చోప్రాయే వీటికీ దర్శకుడుగా ఉంటారని ఆయన చెప్పారు.

## చలనచిత్ర గాయకమండలి

చలనచిత్ర గాయకమండలి (మద్రాసు) సర్వసభ్య సభ మార్చి 31వ త్యాగరాయనగర్‌లో కల్యాణభవనంలో జరిగింది. ఈ క్రిందివారితో కొత్త కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షుడు జి. గోవిందరాజులు నాయుడు; ఉపాధ్యక్షులు ఘంటసాల వెంకటేశ్వరరావు, [illegible], పెండ్యాల నాగేశ్వరరావు. కార్యదర్శి జి. వి. కృష్ణమూర్తి కోశాధికారి కె. వి. మహాదేవన్ మరి 21 మందితో కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

* * *

బి. ఎ. ఎస్. (సెంచురీ) ప్రొడక్షన్స్ వారి కొత్త జానపదచిత్రం రాణీరత్నప్రభ గతవారం సెన్సారైంది. ఈనెల రెండో వారం విడుదల కాగలదని తెలుస్తుంది.

అంజలిదేవి, రామారావు, రేలంగి, బాలకృష్ణ, గుమ్మడి సి. ఎస్. ఆర్. సంధ్య, రాధిక మున్నగువారు పాల్గొన్నారు. కథ సదాశివబ్రహ్మం వ్రాశారు. మాటలు సదాశివబ్రహ్మం, పి. ఆర్. కౌండిన్య, పాటలు ఆరుద్ర, కొసరాజు వ్రాశారు.

సంగీత దర్శకుడు ఎస్. రాజేశ్వరరావు దర్శకుడు బి. ఎ. సుబ్బారావు

* * *





"శ్రీకృష్ణుడికాలంలో ఇటాలియన్ సెరెనేడ్‌లు పాప్యులర్ హిట్స్ అని ఇంతకాలం నేను పసిగట్టలేదుస్మీ"

## డాక్యుమెంటరీ చిత్రాలు

(59 పేజీ తరువాయి)

లిమిటెడ్ కోసం తయారుచేసిన డాక్యుమెంటరీ "స్కై హాక్", రంగుల్లో తీశారు. 1959 టురిన్ చలనచిత్రోత్సవంలో బహుమతి లభించింది దీనికి.

కేంద్ర సమాచారశాఖ కార్యాలయం కోసం శేక్ ఫిలిమ్స్ లిమిటెడ్ తయారుచేసిన డాక్యుమెంటరీ "డిజైన్డ్ ఇన్ బ్రిటన్" బ్రిటన్‌లో మోటారుకార్లూ, విమానాలూ తెగలవంటి రకరకాల వస్తువులు ఎలా తయారవుతున్నదీ వివరిస్తుంది యీ చిత్రం. యుద్ధం రోజులనుంచీ నమూనాలంటే శ్రద్ధ ఎక్కువైంది బ్రిటన్‌కు. ఇదివరకు బ్రిటన్‌లో తయారయ్యే వస్తువులలో చేత్తో తయారుచేసినవే అందమైనవిగా ఉండేవి, అవన్నీ ఫ్యాక్టరీలో తయారవుతున్నాయ్ ఇప్పుడు - అదివరకటి అందం చెడకుండానే తయారవుతున్నాయ్. ప్రజల అభిరుచి బాగుపడడానికి లండన్‌లో నమూనాల కేంద్రం కొంత కారణం. ఏటేటా కొన్నివేలమంది అక్కడికి వెళ్ళి డాక్యుమెంటరీలు చూస్తుంటారు.

మాలక్ ఫిలిమ్ యూనిట్ తయారుచేసిన డాక్యుమెంటరీ 'అవర్ పోస్టేజ్ స్టాంప్స్' కొత్త స్టాంప్ తయారుచేసేటప్పటి వివరాలను చూపిస్తుంది యీ చిత్రం.

★

# మా ఇంటి వాడుకకు
# మేలురకపు టీ
# బ్రూక్ బాండ్
# స్పెషల్ హోటల్ బ్లెండ్
## డస్ట్ టీ

* ప్రతి ప్యాకెట్టూ మీ కెన్నో కప్పుల కమ్మని టీని ఇచ్చును.
* కల్తీలేని అసలైన తాజా టీ

3 సైజులలో లభించును–
1 పౌను,
4 ఔన్సులు,
2 ఔన్సులు






నేడే ఓ ప్యాకెట్టు కొని ఇంటికి పట్టుకెళ్లండి

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్ JWT



(౫౯-వ పేజీ తరువాయి)

పోతాలేరాలు. కన్నీరు ఎటుచూచినా మున్నీరై పరివేష్టించి ఉన్నది.

ఇక దశరథుడు లేచి లేచి పడుతాడు. ఎలుగెత్తి ఏడుస్తాడు. సోదరచరుకోని ఘోర మంటాడు. "నాయనా! రామా, అమ్మా. సీతా! లక్ష్మణా తండ్రీ!" అని ఎవో దిక్కులతో పలికిపోతాడు. అలా పిలిచి పిలిచి బదులు లేదని కదలి కదలి కన్నీరు కారుస్తాడు. ఆయన సంకటము జనానా వారందరికీ సంకటమయినది. ఆయన దుఃఖము వారి కన్నులలో ప్రతిబింబించినది.

"రామా—వృద్ధ జనకుని జాలిదలపని ధర్మమేలనయ్యా" అని జాలిగా దుఃఖిస్తాడు. 'అరామ జ్ఞానా కొడుకుగా యువరాజును చేసి నాకు దైవమా—మరెవ్వరి కడుపున పుట్టినా రాముడు క్షమించేవాడు కదా ... అహో... కైకేయిని మీ మహోగ్రకాంతారంలో నో పుండరీకంగా జన్మింపచేయక యీ అంతఃపుర వాసినిగా ఎందుకు చేశావయ్యా" అని తలవాదకొంటాడు.

కౌసల్య ఆయనను ఓదార్చింది. దశరథుడు సుమంత్రుని అడవికి పంపి తనకన్న బిడ్డలను చూచిరమ్మన్నాడు. వెంట గొనిరమ్మన్నాడు. సుమంత్రుడు తిరిగి వట్టి రథముతో వచ్చినాడు. దశరథుని మన్నకడుపు వారి పునర్దర్శనానంద సంధానము కాంక్షించినది కాని అది జరుగలేదు. అడవిగాలులు కూడా రఘునందనుని ఒడలు తాకి తనివి తీరగ తన్మయులైనారో గాని తన భాగ్యము లేదని దుఃఖించినాడు.

"సుమంత్రా! వృద్ధుడనై అవసానదశలో ఉన్న నన్ను గూర్చి నా కన్న బిడ్డలేమన్నారు" అన్నాడు.

సుమంత్రుడు మిన్నకున్నాడు. నిరుత్తరుడే అయినాడు. కొంత సేపటికి గద్గదకంఠుడై యిట్లా అన్నాడు.

"మహారాజా-దశరథేశ్వరా! వారందరూ మిమ్ములను గురించే మాట్లాడినారు. శ్రీరామచంద్రుడా ఏదో చెప్పబోయి రుద్ధకంఠుడైనాడు. అంతటితో చెప్పదలచినమాట నాలికే అడుగంటి పోయినది. ఏమీ చెప్పకనే వారు అడవికి వెళ్ళిపోయినారు" అన్నాడు.

ఆశాశ్వాసములతో జీవాలు నిలబెట్టుకొన్న దశరథరాజుకీ మాట అశనిపాతమైనది. మూర్ఛపోయినాడు. కొంత తడవుకు ఆయన తెలివి తెచ్చుకుని దీనదీనంగా పుత్రశోకాగ్ని సంతప్తుడై విలపించినాడు.

"నాయనా రామా! నీవు నాకు లేక లేక పుట్టిన బిడ్డడవు. ఇంతవాడవయినావు. నా పంచప్రాణాలా నీ వనవాస అపేక్షతో నే చేసినాన్ని జీవించినాను సుమా! నీకు రాజ్యాభిషేకంచేసి ప్రజలకు నల్లని వెలుగని తెలియజేద్దామనుకున్నాను. తమ్ముళ్లను మమకారాదర భావాలతో చూడమని నీకు చెప్పి, జీవితావశేషం నిశ్చింతగా వానప్రస్థంలో గడిపివేద్దామనుకున్నాను. నాయనా! నా యీ ఆశలన్నీ యింతలో యిలా అన్యాయమౌతాయని అనుకోలేదు. అహో! ఈ కైక నా నమ్మకము కొరవిచ్చునట్లు పరిణమించింది. నా ఆశలన్నీ అన్యధాకరించింది" అని అవృద్ధరాజు గద్గదకంఠుడై అనుక్రోశించినాడు.

"సుమంత్రా ఆ కైకేయీదేవిగారితో వెళ్ళి చెప్పు. నా నయనాభిరాముడయిన రాముడు వెళ్ళిపోయినాడని చెప్పు. తిరిగిరాడని చెప్పవయ్యా. తన కసితీరిందని సంతోషింపుమని మరీ చెప్పు. కొడుకును రావించుకొని కొలువుకూటంలో పట్టంకట్టుకోమని. తనఅద్భుత విశేషం సంపాలమై పండించని వెళ్ళి చెప్పు నాయనా" అని బాధగా నిట్టూర్చినాడు.

మహారాజా ఇప్పుడు సంధిజ్వర పీడితుని వలె ఉన్మాదిరయినాడు. ప్రలాపించినాడు, విలాపించినాడు.

"ఓహో—నా పితృలోకతలం కూడా వచ్చారు. ఇక నాకిక్కృహుమరణమే శరణ్యం. అంతఃపురమే నాకు మునిజనారణ్యం! అదుగో నా పితృపితామహులు! దిలీపులవారు! రఘుమహారాజా! నా తండ్రి అజుడు! నాకోసం వచ్చారు... నాయనా రామా! నేనిక వెళ్ళి పోతున్నానయ్యా! అమ్మా సీతా... తండ్రి లక్ష్మణా..."

పుత్రశోకమే లోకమై వృద్ధుడైన దశరథ మహారాజు ప్రపంచ క్లేశకోశుడై దుఃఖవివశుడై, అవశుడై పంచత్వమునొందినాడు.

(సశేషము)



"పొద్దుపోయింది. వెళ్ళొస్తామండి."
"మంచిది మంచిది. సెలవు, సెలవు."

## పొట్టి కథలు:

# 'కుర్రతనపు' మాటలు

### పైవాడో!

ఒక నాగన్న, ఊరి మాటు మణిగాక పొలంలో కుప్పపోసిన ధాన్యం దొంగిలించడానికి బయల్దేరాడు. గోనెసంచి పట్టుకుని అతని కొడుకు — పదేళ్లవాడు కూడా వెళ్ళాడు.

చేలోకి దిగబోయే ముందు దొంగ నాగన్న కుడివేపు చూచాడు; ఎడమవేపు చూచాడు; వెనకవేపు చూచాడు; కాళ్లెత్తి ముందు వేపు చూపు సారించాడు. కనుచూపు మేరలో ఎవరూ లేరని ఖరారుచేసుకొని చేనులో దిగాడు.

తండ్రితోపాటే నాలుగు దిక్కులూ చూసిన కుర్ర నాగన్న, "మరి 'పైవేపు' చూడలేదేమే నాన్నా" అన్నాడు.

### సబబు

తండ్రి: అబ్బీ బళ్లో అల్లరి చేస్తున్నావుట నిజమేనా?

అబ్బి: ఔనా నాన్నా. నువ్వాఫీసులో అల్లరిచేస్తున్నావా అని నేనెప్పుడైనా అడిగానా?

* * *

"మా నాన్నకిబోల్డుడబ్బుంది. ఎంత డబ్బుందంటే, ఎలా ఖర్చు పెట్టాలో కూడా తెలీదుట. ఎంతకీ అవదుట"

"ఓస్. మా నాన్నకి ఇంకా బోల్డు డబ్బుంది. మా అమ్మ, అక్కయ్యా కూడా ఎంత ఖర్చు పెట్టినా అయిపోనంత ఉందట. మా నాన్న చెప్పాడు."

* * *

"నాన్నా నాన్నోయ్! మరేం నువ్వు బలే అదృష్టవంతుడివి తెలుసా?"

"ఏం? ఎవరన్నారు?"

"మరే, ఇవాళ పరీక్ష రిజల్టులు వచ్చాయిగా నేను మళ్లీ ఇందాకటి క్లాసే చదవాలి నువ్వు కొత్తపుస్తకాలు కొనక్కర్లేదు. పాతవే చాలు."

* * *

రంగడు తిరుబాటుగా ఏడుస్తున్నాడు.

"తప్పమ్మా అలా ఏడవకూడదు" అన్నారు బామ్మగారు.

రంగడు ఏడుపు ఆపి కోపంగా చూశాడు "నాకిలాగే ఏడవడం చేతనౌను. ఇంకోలా రాదు" అని కొనసాగించాడు.

* * *

తండ్రి: నీ ప్రోగ్రెస్ రిపోర్టు నాకేం నచ్చలేదు ఛీఛీ

కొడుకు: నేను చెప్పా నాన్నా మేష్టారికి-మా నాన్నకి నచ్చదండీ అని అయినా సరే నీకు చూపించాలన్నారు.

* * *

"ఒరేయ్! ఆకుక్క తోక పట్టుకు లాగకు. కరుస్తుంది."

"హా బాబాయి తోకక్కడేనా కరుస్తుందేవిటి. నోరు కరచును."

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at
Au Andhr Patr ka Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad

# మీ బుగ్గలమీద పసిపాప అరచేయి వేసిన అనుభవము

గడ్డము చేసుకొన్న తరువాత కుటికురా పౌడరును రాసుకొంటే మీ గడ్డము మృదువుగానుండును. గడ్డము చేసుకొన్న తరువాత కలిగే చికాకులు లేకుండా ఉపశమనము కలిగించి యీ పౌడరు మీ ముఖమును మృదువుగా మరియు తాజాగా ఉంచుతుంది. మెత్తగా ఉండి తాజాదనమును యిచ్చే కుటికురా పౌడరును రోజూ రాసుకోండి. ఉపశమనము, చల్లదనము చేకూర్చే కుటికురా ఎంతో మెత్తగా ఉండి చెమటను పీలుస్తుంది ఇది ఉండలు కట్టి రాలిపోదు మరియు ఎట్టి అసౌఖ్యమును కలిగించదు. చర్మ రక్షక ఔషధములు చేర్చబడి, తేలికైన సువాసనగల యీ పౌడరు చెమట వాసన లేకుండా రోజంతా రక్షణనిస్తుంది. సర్వోపయుక్తమగు యీ పౌడరు రాసుకొనుటకు, కాళ్లమీద జల్లుకొనుటకు, పిల్లల మరియు రోగుల సంరక్షణకు దివ్యముగా ఉంటుంది.




డబ్బా ధర
రు. 1.75 నయా పైసలు

## కుటికురా

కుటుంబములో అందరూ వాడదగిన
సర్వోపయుక్తమైన టాల్కం పౌడరు

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.